వేదపాఠమొక్కంటను, వాదివినిహిత తదామ్నాయాంతర్గతకంటకోద్ధారార్థంబుం బోలె బోధముద్రి నొక్కటం బూని మెఱసె. నతిమృదులంబులు లలితంబులు నగునమ్మహితు కరపల్లవంబులు పొందమ్మిఁడాలు నకుఁ బాటచ్చరంబులును, నమరద్రుమంబులలేఁజివుళ్లకు సహచరంబులు నయ్యె. శరదిందుకిరణధవళంబై బిసతంతుసుకుమారంబైనయుపవీతంబుఁ దాల్చివిజయలక్ష్మీశయ్యాతలంబై యురరవిశాలంబై మాంసలంబై తదీయోరస్థలి చూడ నొప్పారె. బహిరంతశ్శత్రునిగ్రహాలాంఛనజయ స్తంభయుగీస భావన శుంభల్లక్షణోపేతంబులు పరిఘాకారంబులునై తద్దోర్దండంబులుద్దండకాంతి గనుమీఱెఁ. బ్రతిపక్షశిక్షణదక్షం బగువిజయశంఖంబుం బోలి ధీరధ్వానిం గంఠంబు దీపించెఁ. గెమ్మోవిఁ దవిలినపలువరుసబిసుసువెలిడాలు నవనవంబగుపవడంపుఁదీవెల నలమినశారదం బైనపంచువెన్నెలలఁదలదన్ని యొప్పె. సంతతముఖాశ్రిత సరస్వతికినై విధాత నెలకొల్పిన నిద్దంపుటద్దంబు లనంగఁ గపోలఫలకంబులు తులకించెఁ బయోధిసంభూతం బగునిందుబింబంబు పగిదిఁ గాక సర్వలోకసుకృతజలధిసముద్గతం బగుతదాననంబు సద్గుణప్రకాశకంబై దీపించె. యదంతరావాసయై యిందిరాసుందరి దీనవసుమతీదేవపురంధ్రీదారిద్ర్యపిశాచోచ్చాటనమంత్రిం బగు కనకధారావృష్టి నెఱపె నట్టి యయ్యనఘునిలోచనమహిమంబు వర్ణింప నరిది. దుర్వారవైరిదూషణవిజృంభణక్షయసముల్లసితసేతుకారకంబులు, నతికాయవిభ్రమధ్వంసకంబులు, సంసారిశాఖామృగహర్షాధాయకంబులుఁ బయోబ్ధివీచినదలంకారంబులును లంకారులు నగు నాతాపసకులచంద్రునికటాక్షాంకూరంబులు శ్రీరామచంద్రకటాక్షములకు వియ్యంబు లయ్యె నంతియ కాక. 10

మ. అతిఘోరక్షితిరూఢకంటకకులంబై మారదావాగ్నిహే
త్యతులంబై బహుళార్తపంకిలతరంబై యామసమానేకపో
ద్ధతమై ధైర్యముఁ మాల్పుసంస్కృతికదధ్వం బిచ్చు నాయాసవి
స్తృతి మాయించుఁదదీక్షణంబులు సుధావృష్టికి న్నూదక్షముల్. 11.

ఉ. ఆకరుణాబ్ధిఁ జేరి త్రిపథాగ యంచుఁ దదాననాచ్ఛభ
స్మాకలితత్రిపుండ్రకము నందురు కొందఱ, అదెట్టులైన నౌఁ
గాక, త్రయీశిఖార్థము లఖండముగా వివరించు ప్రోడిచేఁ
గైకొన నున్నకీర్తులత్రికంబునకున్ బ్రతిభూత్రయం బగున్. 12.

గీ. కాంచి యెవ్వాని నిరుపమాకార మెదల
నిపుణులు మనోజ్ఞు మదనుఁ దృణీకరింత్రు
తఁడు శాంభవలీలావతార మనుచు
సుందరుఁడు నంచు జను లెంచ సుగమమె కద. 13.

చ. వికృతమహాజ్ఞతాగహనవీథులఁ జిక్కి భవాఖ్యదావపా
వకపరిపచ్యమాను లగువారల కందఱ కాత్మవిద్య లె
స్స కలిపి ప్రోవ, మాన మెడసల్పి వటద్రుమమూలమున్ దద్యజిం
చి కదలె శంభుమూర్తి శమశీలమునం గొనిశంకరాకృతిన్. 14.

శా. స్వాయచ్ఛందవిరుద్ధవాదకుహనాపాండిత్యవైతండికుం
డై యాశంకరుఁ డుద్భవింపఁ బదభక్తానంతతాపవ్యథా
పాయం బాయె నధీరులై వడఁకి రావైభాషికాదుల్ కథా
వైయాత్యప్రతిభల్ నశింపఁ జెసి రన్వైశేషికా ద్యుద్ధతుల్. 15.

గీ. మదనజయమున సర్వజ్ఞమహిమ విబుధ
శస్యతను శంకరుం డల్లశంకరుండె
కాని యాతండు యజ్ఞవిఘాతకుం డి
తండొ యజ్ఞక్రియాసాధకుండు దలఁప. 16.

క. ఆమహితతపముని నొకనిఁ గ
లావాత్రితులానుకారి లక్షింపఁగ నౌ
నేమి జగత్త్రయవిబుధ
స్తోమంబున నతని కతఁడె తుల నిక్కముగా. 17.

క. నందనమున సురతరు లటు
మందారములందు బహుసుమములటు లం దిం
దిందిరములయటు శంకరు
నందు సుగుణబృద మందమందు నసంఖ్యల్. 18.

మ. ఘన నూకామము పస్తుచర్చ, బ్రతిఘా కార్కశ్యహింసల్ క్షమా
ర్జనచే, దైన్యపరిగ్రహానృతకథాశల్ తుష్టిచే, మచ్చరం
బనసూయల్, మదమానముల్ పర*మహాత్మ్యాధ్యానవిత్తాశయా
ప్తిని ఖండించె నతండు తృప్తిపటిమల్ దృష్టాపిశాచింబలెన్. 19.

గీ. చేరి తన్ను నుశూశ్రూషించుశిష్యజనుల
కామము సమూలఘాతమ్ముగా వధించె
సరవి రోషంబు చూర్ణపేషముగ నూతెం
జెండె లోభాదికముం దృణచ్ఛేదముగను. 20.

సీ. ఘర్మమర్మచ్ఛిదా కారులై దివమందె
కాంతె యీచంద్రమఃకరము లేమి?
యవి కావు ముగ్ధరో! యభవనవీనావ
తారశంకరగుణోత్కరము సువ్వె.
ప్రాణేశ! యల్లని వ్యాకోచ మెల్లొందం
జాలె నీయుత్పలషండ మెల్లం?
జెలియరో! వినుము విస్మేరదిక్కామినీ
పాండురాపాంగ పరిభాపరివాహ
గీ. మనుచుం బ్రశ్నోత్తరములు దిగంతదంతి
దంతతుల కయ్యె; శంకగాత్యంతవిమల
సుగుణనిబిడాంబరాచ్ఛన్నజగములందు
మునువులో గుద్దులాట పెంపెసంగుకతన 21.

* "పరులమే లగ్గింపంగా నేర్చు బుద్ధిని" అని పాఠాంతరము.

మ. కనులం గాంచదు మాక్షికద్రవము, ద్రాక్షల్ శిక్షలం బెట్టు, నె
మ్మనమం దెంచదు క్షీర, మిక్షురసముం బాటింప, దాశాంతలం
ఘనజంఘాలము మాధురీమదభరాక్రాంతంబు నాశంకరా
ర్యనిసర్గామలసద్గుణోత్కర మనార్యారుంతుదాకారమై. 22.

సీ. త్యజియించుకొనుఁగాక ధాత్రి సర్వంసహా
ఖ్యానమ్ము శంకరుక్షాంతిఁ గాంచి
పరిహరించునుగాక బాహులేయుఁడు గర్వ
విస్ఫూర్తి శంకరువిద్య లెఱిఁగి
వఱువట్లుగొనుఁగాక బాదరాయణికీర్తి
శంకరువైరాగ్యసార మరసి
విడువఁజూచునుగాక వేధ వాగ్ధాటిరి
శంకరువక్తృతాశక్తిఁ దెలిసి
గీ. యట్టిక్షాంతియు నట్టివిద్యామహత్త్వ
యట్టివైరాగ్య మట్టివాచాతిదార్ఢ్య
మొక్కశంకరునందుఁగా కొరులయందుఁ
గాంచఁ దర మౌనె వేయి పల్కు లేల? 23.

శా. గోముం గన్నతదీయమూర్తి క్షమ నా గోత్రాగ్రసగోత్రమ్ము, శో
భాముగ్ధం బగుకీర్తి విద్యఁ బడయుఁ భాషావిభావత్వముఁ
గామంబుల్ శ్రితకోటి కిచ్చుతతి నాఁ గల్పద్రుకల్పంబు సీ
మాముక్తద్యుతి దానిఁ బోల జగముల్ మందాక్షమందాక్షమా.

క. కలుగఁడు తత్సదృశుఁ డిలా
తలమునను బురాతనాద్యతనులం దొకఁడుఁ
గలుఁగఁ డిఁక ననాగతమునఁ
గలిగెనె మేరువును బోలఁగలగిరు లెందుఁ. 25.

గీ. పొదలెఁ దత్కుల మక్కాళావిదునిచేత
మెఱసె సతఁడును సౌశీల్యగరిమచేతఁ
దనరె నాసుశీలమును విద్యామహత్త్వ
వెలిఁగె నావిద్యలును మహావినయలక్ష్మి. 26.

గీ. గుణములు చివుళ్లు, సత్కీర్తి కుసుమములు, శ్రీ
యద్బుధులు తేఁట్లు, శాంతి యనంతరసము,
బోధము ఫలంబు గాఁగ స్వర్యూజమట్లు
రాజిలెను దద్విచక్షణరాజహాళి. 27.

శంకరవాగ్వర్ణనము.

గీ. కవివరుం డగునతనివాక్చతురిమంబుఁ
గాణభుజవాణి, కాపిలవాణి, యార
సేంద్రివాణియుఁ గనఁజాల వింత యనిన
నితరఫణితులగతి వచియింపనేల? 28.

గీ. భట్టభాస్కరమర్దనప్రాప్తదుర్ద
శానిమగ్నాగమాంతహస్తగ్రహమ్ము
లయిన శాంకరవాఙ్నివహమ్ము లొలుకు
నక్షరం బగుభవ్య రసాయనంబు 29.

శా. జాటాటీరజటాకటీతటనటత్స్వర్ణిమ్నగాభూమిలో
కాటాట్య ప్రథమావతార పటుగర్వాటోప లుంటాకమై
ధాటిన్ గర్జిలుశంకరాచలలురద్వాణీసరిఁతీర్థురుల్.
మాటాఁడున్ జగతీభయప్రదము లౌదుర్భిక్షుదుర్భిక్షముల్. 30.

సీ. మానసమత్తసామజయూథపమువారి
బోధభూపతివాసమునకు దారి

దురితపూర్ణాపారదుర్వాదనిస్సారి
సూరిహారీకృతాకారహారి
యమితచింతాతూలహరణవాతలహరి
తతసంసృతిపయోధితారణతరి
యగునశంకరునిగమార్థవాగ్వైఖరి
వెలసెఁగథాదర్పకలితసూరి
గీ. జాలకండూలరసనాసనాళభూమి
పతనకారణారణ్యకశ్రుతినిపాత,
మచలితాద్వైతలక్ష్మీజయాంకఘంటి
కా ఘణాఘణ ముపనిషద్గ్రంథిలంబు 31.

సీ. ఘనసారకస్తూరికాగంధసంరంభ
పరిరంభణప్రియంభావుకములు
తాపోపగమనిర్మథననిశాకరకరా
హంకారభారకూలంకషములు
ద్రాక్షాసితామధుగోక్షీరమధురిమ
న్యాప్రపారపూర్ణశివంకరములు
నవనవోద్భిన్నపల్లవగుచ్ఛకాంతిసం
దోహదోహలపశ్యతోహరములు
గీ. త్యక్తకంటక ప్రాజ్ఞపాంథప్రకీర్ణ
దీపితాద్వైతమోక్షఘంటాపథము
లంకృతామ్లానకుసుమమాల్యాంకతోర
ణములు శంకరుమృదుభాషణములగములు. 32.

ఉ. దవ్వుగఁ జిమ్మి దుర్ణయవితానరంజంబుల, నీతిబాధలన్
జువ్వి, గుణాలి మేల్పడి, సిరుల్ గనుశంకరువాక్సమీరముల్
మవ్వపుఁదావు లొల్కి విమలంపుభవాటవిలోన నాధియన్
గ్రొవ్వినయగ్గివేఁడిమిని గూరినవెవ్వగ లెల్లఁ జివ్వతన్. 33.

మ. రసరారంగనటచ్చతుర్ముఖవధూరత్నాంఘ్రిమంజీరభూ
రసితంబో! విలసత్త్వదీయకటిభారస్ఫారసౌవర్ణసా
రసనారావమొ! తచ్చలత్కరయుగీరాజన్మణికంకణో
ల్లసితక్వాణమొ! నాఁగ శంకరుకలాలాపంబు లేపారెడున్.

శా. ప్రావృట్కాలవిజృంభమాణఘనధీరధ్వానడింభంబు, వా
త్యావిక్రాంతివిఘూర్ణదర్ణవచలత్కల్లోలజృంభంబు, మ
ల్లీవల్లీప్రసవోదయత్పరిమళాశ్లేషప్రలంభంబు, వి
ద్యావారాంనిధి యైనశంకరుపటీయస్సూక్తిగుంభం బిలన్. 35

ఉ. * వేద్య మవద్యముం జహదవిద్యము నై యమృతోద్యమై సుధా
స్వాద్య మరాతిచోద్యకులిశాద్యవిభేద్యము సత్కళాసహ
ద్యాద్యము యోగపద్యహృతసాద్యఘవద్యము నై ముముక్షుసం
వేద్యము నై నశంకరు నవేలశివోద్య మిడున్ సుఖాద్యమున్. 36

సీ. ఆయాసమునకు నవాంకూరమును బీజ
రూపంబు ఘనమనస్తాపమునకుఁ
బూర్వరంగమ్ము పరిభూతసంక్లేశమ్ము
లకుఁ బ్రాగ్భవాపూర్వలబ్ధములకు
వినఁ జెప్ప రాని వేవేలదోషములకుఁ
బ్రస్తావనాడిండిమ స్తనితము
గార్మణం బనృతసంకథనమ్ము నకు నిష్క
టమ్ము సచ్ఛింతాచయమ్ములకును

గీ. నగు చమేయావిచింతనీయాపరిధృష్య
మైనదేహాద్యహంకార మంతరింప

* (1) సుధా=అమృతమువలె; సు=మిగుల; అద్యము=తినఁదగినది; (2) సాది=జీవుల యొక్క; అఘవద్యము=పాపోక్తి; (3) శివోద్యము=శుభోక్తి; (4) సుఖాద్యము=సుఖముగా తినఁదగినది, సుఖ+అద్యము=సుఖమునందలి యాద్యము.

శంకరార్యోక్తి యనుపరశ్వథముదక్క
నఱుకఁ జాలినసాధనాంతరము గలదె? 37.

గీ. స్వాద్వైతసూక్తిగర్భశుక్త్యంతరుదిత
మౌక్తికం బగుశాంకరీయోక్తి క్షపణ
కప్రతారణహతి బౌద్ధ కాపథహతిఁ
జేసి పడినయాశ్రితులకు సంజీవనంబు. ౩౮.

మ. ఘనఝంఝానిలకంపితద్యుతటినీకల్లోలకోలాహల
స్వనసోదర్యము నైకదుర్మతరజఃపాళీహరం బౌచుఁ బే
ర్చిన శ్రీశంకరకోవిదేశ్వరజరీజృంభద్వచోనిర్ఝరం
బనుకూలించు సధర్మదుర్మతనిఖాతాఽశాంతి శాంతింపఁగన్. ౩9.

ఉ. ఆరఁగ నవ్వుమల్లెపువ్వులందలితావులఁ గౌఁగిలించి మం
దారమరందధారల నణంగని కమ్మఁదనమ్ముఁ దేర్చి యా
చారవిచారసింధు వగుశంకరుప్రన్నని పెన్నుడుల్ సుధీ
వారమనంబు లన్నికొన బాళిగొనన్ వలపింపఁ జేయవే. 40.

మ. అనవచ్ఛిన్నసుఖానుభూతి నిడునయ్యార్యోక్తిధారాసుధా
వనధిన్ దేలునెవండు నాసపడునే ద్వైతిప్రబోధమ్ములన్?
గనునే కచ్చరదుష్పటచ్చరజరత్కంథానుబద్ధాదరం
బును జిత్రం బగుకాంచనాంబరశతంబుల్ దాల్చువాఁ డెవ్వఁడున్.

చ. నిరుపమశంకరోక్తిపరిశిష్ఠితచిత్తుఁడు తేనె నూనెగా
నరయుచు, ద్రాక్ష శిక్ష నిడి యద్దిర! క్షీరము క్షారమంచు వా
చఱచుచు మోచ కాచ మనఁ జాగి సితన్ భసితం బటంచుఁ జె
చ్చెర వెగటొందుఁ గుందు నిరసించు హసించు రసించుమించుగన్.

ఉ. తియ్యఁదనంబు నంతయును దేనియ యమ్మెను, ద్రాక్ష ప్రీతిచే
నొయ్యన నిచ్చెఁ, బాత్రి మనసూహను క్షీర మొసంగె, నిక్షువున్

గయ్యమునందుఁ గోల్పడె వగన్, సుధ చోరభయాప్తి డాఁగెఁగా
కెయ్యెడ లేనితియ్యఁదన మెట్టుల గల్గెను శంకరోక్తికిన్. 43.

ఉ. కప్పుర మప్పుగాఁ గొనియెఁ, గస్తురి గాంచెఁ బఱించి, మల్లియల్
చెప్పినసేవ సేసి పడసెన్, విలిచెన్ మఱి కుంకుమంబు దా,
నెప్పుడొ చందనంబు హరియించెను శంకరుపల్కుఁదావులన్
జెప్పఁ దరంబె దన్మహిమ నిత్యసముల్లసనాతిధన్యముల్. 44.

ఉ. చవిగలకుంపెరుంగు దిని, చాలఁగఁ బాలనుఁ గ్రోలి, యించులోఁ
జవుల నెఱింగి, త్రావి వరుసన్ బువ్వుఁదేనియ జుంటితేనె మే
లవుకదళీఫలాలు దనివార మెసంగినవాఁడు శంకరా
ర్యవచనమాధురిన్ గనుఁడు నవ్వియ కావు సుధన్ స్మరించునే? 45.

చ. భవదవఘుప్రతప్తజనపాళికిఁ గప్రపుజల్లు, మోక్షభా
గ్గవికి నిసర్గనిర్మలతరం బగుమౌక్తికయష్టి, యద్వయా
త్మవిపులసౌఖ్యవృష్టికృతతామరసాకరహంసి, శంకరా
ర్యవచనధార పుణ్యమున నబ్బును బుద్ధివిశుద్ధిసిద్ధికిన్. 46.

సీ. మహిమాభిరంజితామ్నాయశేఖరగణా
 వాపమం దంకురారోప మొంది
యమలామలసురేశ్వరాదికశిష్యసూ
 క్త్యంబుధారాసేచనంబు వడసి
కలితకైవల్యకాంతారూపలలితప
 లాశసంహతుల నుల్లాస మూఁది
విజ్ఞానధనలిప్సువిబుధమనస్సాల
 జాలాధిరోహణలీలఁ గాంచి
గీ. తత్త్వబోధప్రసూనసంతతిని బూచి
యమృతఫలమై ద్విజాతి కుపాస్య యగుచు

నెఱు సోమావతంసనవావతార
గురువచోవల్లి యొసఁగు భక్తులకు శుభము. 47.

మ. నటదీశానకిరీటకోటివిలుఠన్మందాకినీ ద్వేషు లు
ద్భటసంభిన్నసుధాసరోవరపరీవాహావగాహుల్ మదో
త్కటతద్ద్వైతమతానుయాయిదురహంకారాభిచారుల్ పరి
స్ఫుటవేదాంతము లైనసూక్తులఁ దనర్చున్ శంకరుం డున్నతిన్.

శా. సాహంకారసురాసురౌఘకరకర్షాఘూర్ణదుద్దామమం
థాహార్యక్షుభితామృతార్ణవతరంగాకారవాచాసుధా
వ్యూహాసారమునన్ భవాహ్వయదవాగ్న్యుద్వేగమాజంతుసం
దోహంబాఁ దెడుతాపమార్చుగురుఁ డెందున్ నుత్యుఁ డౌటబ్రమే?

శంకరుని కీర్తి వర్ణనము.

గీ. కలశవారాశితోఁ గచాకచి యొనర్చి
కైరవాప్తునితోఁ గదాగది యొనర్చి
రజతశైలంబుతో భుజాభుజి యొనర్చి
యుల్లసిలు శంకరార్యసంఫుల్లయశము. 50.

క. పరిశుద్ధుఁ డెవ్వఁ డిల నను
తఱి శంకరుకీర్తి కోడి తన్మదిరతుఁడై
హరిణాంకుఁ డాకళంకము
దాఁచఁగుట్టకే కాదె జలధిఁ దోఁగును నేఁడున్. 51.

సీ. ధమ్మిల్లమ్మున వినూతనమల్లికాసుమ
సృగ్వినిర్మాణకౌశలిని జూపుఁ
గాంతలలాటభాగమునఁ జాదనరస
చిత్రికశిల్పవైచిత్రిఁ జూపు

గ్రీవాంతరమునఁ దారావళీహారబం
ధురరచనాతిచాతురిని జూపు
మొనసి సర్వాంగీణముగఁ జంద్రికామల
క్షౌమధారణపటిష్ఠతను జూపు
గీ. నహహా! బహుళదివస్ప్రథిమ్నాంతరాళ
పూరితాపూర్వశాంకరీ మోరుకీర్తి
పూరములు హారిదంగనావారముల క
నల్పితాకల్ప మొనరింప నాత్మ నెంచి. 52.

సీ. ఉత్సంగములఁ జేర్చి రాఁడోరుఁ దోఁప్రాచీ
హారిదంబు జేకుఁ గోత్కారము నేర్పఁ
గరముల నల్ల నాకర్షించుఁ బ్రాక్కా
బృందమ్ము ప్రేమనిష్యంద మొప్పఁగఁ
దనివోవ ముద్దాడు దరికి రాఁ దివిచి యా
కాశమ్ము రాగసంగతిఁ జెలంగి
కైఁ జాఁచెనేని జిక్కం డటంచును వియ
ద్గంగ దివ్యను నిటకౌఁగిలింతఁ
గీ. జకోరవాళమ్ము పిలుచుఁ బ్రసన్నవృత్తి
శేషఫణి యాటలాడుకోఁ జిత్తగించు
శంకరార్య యశోహరిణాంకమూర్తి
యద్భుతంబైన సౌందర్యమరసి మురిసి. 53.

గీ. * కాంచు హారిదంతపంక్తి సాంకాశినమ్ము
నర్చఁ జంద్రిక సాంహాసినము వెలార్చుఁ
సమృతచతురిమ సాంలోపినమును సలుపుఁ
దిమిరసాంఘాతిన మ్మాస్మసుధీయశమ్ము. 54.

* "అభివిధౌ భావఇనుణ్" సమ్=సమంతాత్, కాశః=ప్రకాశః ఇతి, భావేఇనుణ్ 'అణి నుణః' సం-కాశ్-ఇన్=సంకాశిన్=అణ్ =సాంకాశినమ్. ఏవమేవ సాంహాసినం, సాంలోపినమ్, సాంఘాతినమ్.

చ. కుతుకపతన్మృగేంద్రనఖకోటివిదీర్ణకరీంద్రకుంభని
ర్గతనవమౌక్తికచ్ఛవినిశాయనిబద్ధనియుద్ధలై మహా
క్షితిధరఘూర్ణనక్షుభితసింధుచలత్పృథులోర్మిమైత్రిపే
క్షిత లయి లోకమందు విలసిల్లెను శంకరుకీర్తిమాలికల్. 55.

చ. చిరముగఁ జక్రవాళదరి! చెందె దనావిలభావ మల్ల శం
కరుసితకీర్తిచంద్రు నిటుఁగాఁగిటఁ బట్టుముదంబుచేనొకో?
సరిసరి నీవు నుత్పలిని! సమ్మద మొందవే? యేలె? యన్న న
య్యిరువురకున్ స్మితంబు జనియించెను బ్రిశ్నల కుత్తరంబుగన్. 56

శా. దుర్వారాయతగర్వవైరిసుమనస్తూలౌఘ వాతూలమై
నిర్వేలాద్భుతబోధశీతకిరణోన్మేషర్ధిదుగ్ధాబ్ధియై
నిర్విఘ్నప్రసరద్భవాహ్వాయదవాగ్నిస్ఫీతసంతాపశాం
త్యర్వాచీనపయోదమై సితయశం డాశంకరుం డొప్పెడున్. 57.

క. ఇతిహాసపురాణంబులు
స్మృతులును శాస్త్రములు పొరిఁబొరిన్ బుధజనసం
యుతుఁడై యరసి యతం డు
న్నత మగు సర్వజ్ఞతాపదంబున్ బడసెన్. 58.

క. ఆయన మతిమతిఁ గాంచెను
వైయాసక శాంతివాక్ప్రపంచము, నుపశాం
త్యాయత్తశుద్ధతం గనె
నాయెడ సర్వజ్ఞభావమ ట్లలవోకన్. 59.

గీ. చక్కఁ జతురాస్యుఁ డయ్యె నసత్ప్రపంచుఁ
డనఁగఁ బురుషోత్తముండె యయ్యెను నభోగ
యోగి యనఁ, గామజేత యయ్యెను విరూప
దర్శనుం డనఁ బ్రథితుఁడై తనరె నతఁడు.

ఉ. ఆననమందు వాణి యలరారుటఁ బద్మజుఁ డంచు, సత్సమా
శ్రీనిరతాభిషక్తి విలసిల్లుట వారిజనాభుఁ డంచు, నా
ర్యానుపమానభక్తిరచితార్ధ్వాణుఁ డౌటఁ బురారి యంచు న
న్మాన్యనిసమాను శంకరుఁ బ్రమాణపురస్సర మెంతు కోవిదుల్. 61.

ఉ. ఆపురుషోత్తముల్ గవియునాస నయోనిజమై జనించి మా
యాపరభిక్షునీత యయి నైకనరానుస్మృతిభ్రమంబునన్
గోపన మైనసత్తఁ బ్రతికూలబుధారులఁ గెల్చి; కొన్నయా
తాపసరూపదేవు నవతారమ కాదొకొ శంకరుం డనన్. 62.

గీ. సంతతబ్రహ్మచర్యదీక్షావిభూతి
నతఁ డనూచానుఁ డగుటె కా దనుపమాన
కుశలతను మహాంతర్వాణిగూడ నగుట
నడపె గురుఁడు సమావర్తనవ్రతంబు. 63

క. ఏడేండ్లయీడునకు నిటు
లీడెఱుఁగనిపాండితీమహిమఁ గని గురులన్
వేడి సెలవొంది వటువుల
వీడుకొని యతండు నిజనివేశము సేరెన్. 64.

శంకరుఁడు తల్లికడకు వచ్చుట.

ఉ. చేరి నిజాంబికాంఘ్రిసరసీజయుగంబున కొయ్యనన్ నమ
స్కారము లాచరించి స్వసుఖం బెఱిఁగించుచు నామె సేమ మిం
పార నెఱింగి బాంధవుల నందఱ సాదరసూక్తులన్ బుర
స్కార మొనర్చి శంకరుఁ డఖండసుఖంబున నుండె నింటిలో. 65.

ఉ. సప్తశరద్వయోంచితుఁడు శంకరుఁ డాక్రియ నిల్లు సేరి య
త్యాప్తత మాతృదేవత సమర్చనలన్ దనియించుచున్ సరో

జాప్తుని సప్తజిహ్వుని నుపాస్తి యొనర్చుచు వేదశాస్త్రసం
ప్రాప్తమతిప్రకాశనిరవద్యసముద్యముఁడై విరాజిల్లెన్. 66.

క. తరుణుఁడు కినియుండు, వయః
పరిణతుఁ డాసన మొసంగఁ, బ్రణయమ్మున నె
ల్లరు నంజలి నొదలఁ గూ
ర్తురు, పసివాఁ డైన శంకరుం డగపడినన్. 67.

సీ. భయభక్తియుక్తులై పాయనివటుల న
ధ్యాపించుఁ గోరిన యాగమములు
శ్రుతినదీష్ణులఁ బరాజితులఁ జేయు వధాన
మొనరఁగా వికృతుల నుగ్గడించి
పలుకుఁ ద్రయీవాక్యముల ననులోమవి
లోమరీతుల బుధాళులు నుతింపఁ
గమ్రవీణాక్వాణకల్పంబుగా సామ
గాన మొనర్చు బా ల్గరఁగిపోవ.
గీ. నలువనలుమోముఁదమ్ముల మొలచినట్టి
మెలపు దులకింప నిర్దోషవిలసనముగ
వేదముల సాధనను జేయు విడువకుండ
శంకరుఁడు సజ్జనవ్రాతకింకరుండు. 68.

సీ. కఠవల్లితోడ శిక్షావల్లి శోధించు
వల్లించు నానందవల్లి యలరి
పఠియించు భృగువల్లి కఠమునర్థ మెఱుంగు
ఛాందోగ్యమున రహస్యములఁ దెలియు
నరయు శ్రద్ధను బృహదారణ్యకమ్మున
ధ్యయనించి చూచు నారాయణమ్ము

ముండకమాండూక్యములయర్థములు గ్రోలుఁ
దాపనీయార్థముల్ తఱచి చూచుఁ

గీ. గనును భగవద్గీతార్థ మనుపదముగ
బాదరాయణసూత్రతాత్పర్య మరసి
సమ్మదాశ్రుపరిపూర్ణలోచనసరోజుఁ
డౌచుఁ బరవశుఁడై పోవు నాబుధుండు. 69.

గీ. పాణినీయవార్త్తికమహాభాష్యవిరచ
నాధ్వముల నధ్వనీనుఁడై యనుపమాన
మైనతత్త్వప్రభావమ్ము లాత్మఁ దలఁచి
సలుపు జోహారు లక్షరాక్షరమునందు 70.

ఆ. భాట్టజైమినీయపటిమ మాస్వాదించి
గాఢగూఢనిరవకాశతత్త్వ
దీయఫణితులను మదిం గండశిలలభే
దనముగాఁ దలంచి వినతిసల్పు. 71.

క. ప్రవిమలమతి గురులొద్దను
శ్రవణము గనినట్టివేదశాస్త్రమ్ముల న
ట్లవిరతమననక్రియ నా
త్మవశమ్ములు సేసికొనె నతం డనహితుఁడై. 72.

ఉ. పుత్రునిపాండితీమతిసముల్లసనంబు నిరంతరాశ్రిత
చ్ఛాత్రగణప్రబోధము వచఃపటిమంబు తపశ్చికీర్ష స
న్మైత్రియుఁ గాంచి తల్లి ప్రమదంబునఁ బొంగుచు, నంతఁబో నిహా
ముత్రఫలానభీప్సితసముత్సుకతన్ గని కుంగు భీతమై. 73.

చ. ముదిసి హృషీకశక్తి గడముట్టుట నన్యులసాయ మొంద నె
మ్మదిఁ దలపోయుతల్లి కణుమాత్రము పీడ పొసంగకుండఁ ద

త్పదములఁ గొల్చి నాఁబుధుఁడు దైవతభావన; బోధ సేయు "న
య్యాది యటు లిద్ది యిట్టు"లని యాయమకోరిక ముక్తిమార్గముల్.

క. కడుపునఁ దన్నుం గన న
ప్పడఁతుక పడినట్టిపాట్లు, పతితో వహ్నిం
బడక తనకొఱకుఁ బ్రాణం
బొడల నిలుపుకొని తపించు టుల్లముఁ గలఁచెన్. 75.

మ. 'తన వైదుష్యము తండ్రి కాంచకయ యంతం బొందె'నం చాపె కం
టను నీర్వెట్టఁగఁ జూడఁజాల కడుగంటన్ సంసృతిప్రేమమున్
దునియున్ వేదపురాణశాస్త్రములయందున్ గన్న కైవల్యసా
ధనవైరాగ్యనిధానసూక్తి ఋషిగాథాబోధనన్ వ్రేల్మిడిన్. 76.

ఆర్యాంబకొఱకు నదీపూర మింటిదరికి శంకరుఁడు దెచ్చుట.

క. ఒకనాఁ డాయమ గ్రామాం
తికతటినికి స్నానమాడ నిచ్చ లరుగు న
ట్లొకతెయు మధ్యాహ్నము సూ
ర్యకిరణపరితప్తసికతిలావనిఁ జనుచోన్. 77.

చ. చండకరప్రతాపహతి సొరు చెడన్ మయి వాఁడి ఘర్మవాః
కాండములన్ మునుఁగ, నరకాళులు పొక్కఁ, దమంబు కన్నులన్
నిండఁగ శ్వాస మాడ కవనీస్థలిఁ ద్రెళ్లఁగ నయ్యుదంత మె
వ్వండొ వచింప శంకరుఁడు వైళమ యేఁగి కలంక నొందుచున్.

క. వివశ యగుజననిఁ గని యా
స్రవంతి నీరమును దెచ్చి చల్లియుఁ దత్సం
భవనళినీదళముల మె
ల్ల విసరి యుపచారములఁ గలంగుచు సలుపన్. '79.

క. ఆర్యాంబ తేఱుకొని పరి
చర్యలు గావించుసుతుని సౌజన్యమహౌ
దార్యములకు జననీహిత
ధుర్యతకును బొంగు చుఁతతో నిలు సేరెన్. 80.

గీ. చేరుజననికి శిశిరోపచారవిధుల
దాహశాంతి యొనర్చి నాతల్లి! నదికి
నరుగఁ జాలనిముదుసలి వైతి వకట!
'వల' దనుచు నీదుకోర్కె దోఁపంగఁ జాల. 81.

క. అని పలుకుచుండునత్తఱి
చను దెంచెను గేరళేంద్రసచివుఁడు మీాద
ర్శనభాగ్యకాంక్షియై మా
జనపాలుం డనిపె, ననుచు సంభ్రమయుతుఁడై. 82.

ఉ. భక్తిభరంబునన్ వినతభావ మెలర్ప నమస్కరించి శాం
తోక్తులఁ దల్లిఁ దేర్చువిబుధోత్తముతో ననె నీమహాద్భుతీ
శక్తి జనంబు దెల్ప నృపచంద్రుఁ డనారత మాలకించి యా
సక్తిని నిన్నుఁ గాంచి నిజజన్మకృతార్థతఁ గాంచ నెంచుచున్. 83.

క. న న్నీపరివారముతో
నిన్నుం గొని తేర ననిపె నేఁడ మహాత్మా!
సన్నిధి సేయుం డన తగ
విన్నప మొనరింప బుధుఁడు విని వినకున్నన్. 84.

ఉ. నివ్వెఱ నొంది మంత్రి జననీపరిచర్యల మగ్నచిత్తుఁ డౌ
నవ్విబుధావతంసునియుదంతము సొంత మెఱింగి యార్య!మీా
నెవ్వగ దీఱు టెట్లగు? నీజననీహృదయాభిలాష నేఁ
డెవ్విధినేని దీరు నృపుఁడే తలపెట్టిన నేది కా దిలన్. 85.

వ. అని పలికి పరివారము నచట నిలిపి పవనజవనం బగుహయం బెక్కి యతిత్వరితగతిం జని యెదురుసూచుచున్నయన్నృపతికి శంకరుని మాతృ శుశ్రూషా దీక్షయు నితరాన పేక్షయు నభివర్ణింప విని యేఁడు ను దద్దయు దద్దరిల్లి ప్రిగ్గడం గాంచి. 86.

క. నీరాకరాకృతిగ నొక
సారణి తద్భవనసవిధసరణిగ నెపుడుం
బాఱఁగఁ ద్రవ్వింపు నదీ
పూరమనోహరముగా నిపుడె యని మఱియున్. 87.

మ. భూపాలోత్తముఁ డంత శంకరపదాంభోరుడ్డిదృక్షావశుం
డై పర్యంతపరీతమంత్రిభటసేనాధీశుఁడై యశ్వధా
రాపాండిత్యము మించ వేల్మిడిని జేరన్ వచ్చి తత్కోవిద
శ్రీపాదాంబురుహద్వయంబుఁ గయిసేసెన్ మౌళిరత్నచ్ఛవిన్. 88

క. పటువై శిశువై వాచా
పటువై వెలుఁగొందునవ్విపశ్చిన్మణి నై
కటికం డగున కేరళ
కటకాధీశ్వరు సుఖాదికము లడిగి తగన్. 89.

గీ. పరిజనసమేతుఁడై నభూపతికి సముచి
తాదరోక్తుల సంతసం బావహింప
జనపతియు భక్తి మౌళి నంజలి ఘటించి
మృదులమధురోక్తులను వచియించె నిట్లు.

క. ఆకాంక్షింతును మది యా
పాక్షికీయపదద్వయీసమర్పణభాగ్య
శ్రీకల్పితజన్మపవి
త్రీకరణము; నేఁటి కయ్యదియ సిద్ధించెన్. 90.

శా. బాలుం డయ్యు శ్రుతిస్మృతానవరతవ్యాఖ్యావిధానైపుణో
ద్వేలుం డంచును వించు నిన్నుఁ గన నువ్విళ్లూరుచుండంగ నీ
వేళన్ సూర్యఖరాతపాహతిగతాభిజ్ఞానమాత్రాంఘ్రిసే
వాలీనుం డయి తంచు మంత్రి పచియుంపన్ వత్తు నాత్రమ్మునన్.

క. అని యార్యాంబాక్షేమం
బును మును విని వినయమున నృపుఁడు మొక్కి వచిం
చె నదీవిమలాంబువగా
హనమునకై చింత దక్కుఁ డాంబయు నీవున్. 93.

క. పూర్ణాశ్రైవలినీపూ
తార్ణోనిత్యావగాహనాసందరమా
పూర్ణు లయి జనని నీవు ను
దీర్ణచరితు లగుదు రెల్లి తెలవాటినచోన్. 94.

గీ. వగవఁ బని లేదు దానికో స్వామి యొక్క
మాఱు మన్మందిరము మీపదారవింద
రజమునఁ బవిత్రమొనరించి రాఁగ భద్ర
వారణముఁ దెచ్చినాఁడ నావాంఛఁ దీర్పు. 95.

వ. అని పూర్ణాపగాపూరపూర్ణంబుగ పారణ నిర్మింప నొనరించినతనయ
త్నంబు దెలిపి గజం బెక్కు మని కోర శంకరుండు ఋషిప్రశస్యం
బుగ ని ట్లనె. 96.

గీ. అజినపరిధానమాధుకరాన్నభుక్తు
లమర శ్రద్ధ సంధ్యావందనాగ్నికార్య
వేదపాఠముల్ గురుసేవ విధిగ వటులు
చేయవలె నంచు శ్రుతియ శాసించుఁ గాదె 97.

మ. నయమార్గప్రిచరిష్ణుశీల! ధరణీంద్రా! నైజకర్మంబుఁ బా
సి యిభాద్యాధమభోగముల్ వడయ వాంఛింపంగ మాబోంట్లకుఁ
నయమా? వర్ణము లెల్లఁ దత్తదుచితన్యాయాధ్వవర్తిష్ణులై
నియమంబూనఁగ రాజు నిల్పవలెఁ గానీ వే అనన్ ధర్మ్యమే? 98.

వ. మజ్జననినిత్యమజ్జనక్రియ కీవొనర్చినయుపకృతి కెంతయుఁగృతజ్ఞుండ నంతియకాని యాశ్రమధర్మోల్లంఘనము సేయ మనసొగ్గదనుటయు.

చ అనయము వెల్లనై నృపతి యాతనిధర్మపథానువర్తనం
బును నుతియించి కాన్కగఁ బ్రభూతసువర్ణము నప్పనం బొన
ర్చి నతులు సేసి తాను విరచించిన నూతననాటకత్రియం
బును వినిపించెఁ, బ్రీతిఁ దెలుపుఁ నెఱసుల్ గలవేని యన్మతిఁ.

క. రసగుణరీతిలలితములు
సుసంధిరుచిరములు సకలసుకవీష్టము ల
య్యు సదృశనాటకములు మా
నసమునకు ముదంబు గూర్చినఁ శంకరుఁడుఁ. 101.

క. 'నరపాల యిట్లు రసనం
భరితము లయి నిష్కలంకభావము లగుసుం
దరకావ్యమ్ములు గలుగవ
ధర నీక నావలన వాంఛితము గలదె? యనఁ. 102.

గీ. అమృతధారాధురంధర మ్మమితహృద్య
సార మగుశాంకరీయభాషణము వినుచు
విరచితాంజలిబంధుఁడై ధరణివిభుఁడు
గోరె స్వోపముఁ డైనకువారుఁ బడయ. 103.

ఉ. అంతట శంకరుండు వసుధాధిపు ని ట్లను హాటకంబు నా
కింత ప్రియంబు గా దొసఁగుమీ యిట నుండు గృహస్థకోటికిఁ.

గాంతువు కామితం బచిరకాలమునం దచనంగదన్న సు
స్వాంతముతో నటంచు జనవల్లభు నంపుచు నేకతంబునన్. 104.

గీ. రాజవరవంశవృద్ధికారణము గాఁగ
శుభ్రత్యుదిత మైనయిష్టి వాక్సిద్ధి యుచిత
సత్కృతులఁ దన్ప; తేఁడును సంతసించి
యతని గుణములఁ బొగడుచు నరిగెఁ బురికి. 105.

క. అరిగి మఱునాఁడ పూర్ణా
సరిదంభోర్ఘురము వాఱు పారణి యలశం
కరుభవనసవిధసీమం
బారయుచుఁ బ్రవహింపఁ జేసె నుత్సాహమునన్. 106.

ఆ. తివిరి శంకరోపదేశానుసారమ్ము
సలిపె నిష్టి శాస్త్రసమ్మతముగ
భక్తి కలుగువారిఁ బాలించు నామ్మాయ
మదియు కాదె సృష్టి కాదికర్త. 107.

వ. అంత. 108.

సీ. తనపుత్రుశక్తి కత్యద్భుతస్వాంతయై
యార్యాంబ యానందమందుఁ దోఁగె
జననీమనోఽభిలాషము దీరెఁ గద యని
శంకరునాత్మ స్వాస్థ్యమ్ము నొందెఁ
దనిసెఁ గేరళవిభుండును గురుకట్న మ
భ్యర్థితంబుగ నీయ నబ్బె ననుచుఁ
బరమావధియ మాతృభక్తికి శంకరుం
డనుజనస్తవము లభ్యధిక మయ్యె.

గీ. వలరి రాబాలగోపాల మగ్రహార
వాసులును దత్సుధీంద్రప్రభావముదిత
వసుమతీపాలరచితశాశ్వతమహోప
కారభరితకృతజ్ఞతో దారు లగుచు. 109.

ఉ. కాలటియగ్రహారమునఁ గా లిడఁగా నవకాశ మబ్బ న
ట్లోలిని జుట్టుఁబట్టఁ గలయూళులవా రరుదెంచి తత్సుధీ
బాలశశాంకుఁ గాంచి పదపద్మము లక్షుల కద్దికొంచుఁ బొం
బూలను బూజసేసిరి యపూర్వతదీయమహత్త్వ మెన్నుచున్. 110.

సీ. ధరణీసురార్భకపరివీతుఁడై యుదూ
త్కరవేష్టితామ్రుతికరుని మించి
ధవళయజ్ఞోపవీతభ్రాజియై గాంగ
ఝరశోభి నీహారధరముఁ బోలి
లలితకృష్ణాజినాలంకృతుండై నీల
పటదీపితప్రలంబఘ్ను నవ్వి
ముంజమంజిమపుంజమంజుకటీరుఁడై
సహరితలతిక ద్యుశాఖ మీఱి 111.

గీ. బ్రహ్మవర్చసతాండవరంగమండ
పాయితానన నలినసద్వన్మఘాళి
నిర్గళితవాఙ్మఖోక్తి నిర్నిద్రబుద్ధి
వెలుఁగుశంకరుఁ గని జనుల్ విమలు లైరి. 112.

క. సకలార్థతత్త్వవిత్తా
ధికుఁ డయ్యును శాస్త్రవిహితదృఢతరభక్తిన్
బ్రకృతోపచారముల జన
నికి ముద మిడు నాతఁ డతివినీతి పొసంగన్. 113.

గీ. శంకరునకు శరణ్యము జనని యామె
కగు శరణ్యము పుత్రుఁ; డన్యోన్యయోగ
విరహ మెంతయు దుస్సహం బిరువురకును
సన్నిధానము త్రిజగతీశాసనమ్ము. 114.

శా. విద్యావంతుఁడు బుద్ధిమంతుఁడు గుణాన్వీతుండు పూతుండు సం
పద్యుక్తుండు పరీశపాదాంబుజయుగీభక్తుం డటంచున్ గృహ
స్థోద్యోగంబు ఘటింపఁ గన్యలఁ గులీనోత్తంసు లీ రాఁగఁ ద
ద్విద్యామూర్తి గొనంగ నొల్లఁ డసటన్ వేరులుంచు టేలా యనన్.

శంకరుని బెండ్లాడు మని తల్లి కోరుట.

శా. ఆయార్యాంబిక యొక్కనాఁడు సుతు నత్యాసక్తిమై డాసి "బి
డ్డా! యేనెల్లసుఖంబు లొంద నీకుఁ గోడల్ వచ్చు టెన్నండో? యీ
కాయక్లేశము లెంత కాలము పడంగా నుండెనో? కాని నా
కాయుష్యంబు నశింపకుండె, నన వాహో పెండ్లిమా టెన్నఁడున్. 116

క. నీ వెంతో విద్య నేర్చి శు
భావహవిధిఁ బెండ్లియాడి యాలును బిడ్డల్
సేవింప వరలుతటఁ గనఁ
గావలె ననుకొనిన తండ్రి కనఁ డాయెఁ గదా. 117.

ఉ. వృద్ధను నేను నట్ల గతియింపక మున్న మదీయబాలసా
సిద్ధి యొనర్చి యింటను వసింపు సుఖంబుగ, నిప్పు డెందఱో
శుద్ధకులుల్ తనూజలను సుందరరూపలఁ బెండ్లి సేయువాం
ఛోద్ధతి వచ్చి చూచి చనుచుండిరి దే యదన్యు దానికిన్" 118.

చ. అని యిటు తల్లి పల్క విని యాత్మజుఁ డీక్రియఁ బల్కెఁ 'దల్లిరో!
వినిచితి నీ మనోరథము విఁటిని, బాలుఁడ నేఁడ పెండ్లియా

డ ననువె? పోడక్కై యెటు కడంగుదునో యిపు డేమి పల్కుదుర
వనటను గాంచు టేల? బలవంత మదృష్టము మ దెట్టు లున్నదో. 119.

గీ. ఈశరీరబంధమ్మున కేవపడుచు
నుండ నొకబంధ, మామీఁద నొకటి, యిట్లు
బంధసందోహమునఁ జిక్కి బాధపడుట
కెట్లు మన సొగ్గుఁ గనుచుండి యెల్లజగము. 120.

ఆ ఫలము వృంతమందు బద్ధమై వ్రేలుట
పాకదశకు వచ్చుదాఁకఁ గాదె
యవుల నీళ్వరుండె యగుఁగాక పడకుండ
నదుకఁగలఁడె వృతమందుఁ దల్లి! 121.

క. అని తన మనోభిలషితం
బునకు విరుద్ధముగఁ బలుకుపుత్రునిబోధం
బును గా దనఁజాలక య
వ్వనిత నిరుద్ధాశ్రువుల నవా క్కయి నిలిచెన. 122.

శంకరునకుఁ గన్య నీయ నొక విప్రుఁ డేఁతెంచుట.

ఉ. అమ్మెఱునాఁడ యొక్కవసుధామరుఁ డాతని నాత్మజన వివా
హ మ్మొనరింప బంధునివహమ్మును దోడ్కొని తద్బుధేంద్రగే
హమ్మున కేఁగుదెంచి తనయాశయ మార్యను గాంచి చెప్పి త
త్సమ్మతి శంకరాంతికము చయ్యనఁ జేరి కనంగ నయ్యెడన. 123.

సీ. ఆసీనుఁ డయ్యెఁ గుశాసనమ్మందుఁ బ
ద్మాసనబంధదార్ఢ్యమ్ము మెఱయఁ
దాల్చె వక్షమున రుద్రాక్షమాలికలతో
విలసిల్లుఁ జినోపవీతములను

దృఢముగాఁ దీర్చె నతిస్వచ్ఛభసిత తి
ర్యక్త్రిపుండ్రములు వెల్వగునొసంటఁ
గౌపీనమును మౌంజికటిబంధము వెలుంగ
నలరె స్మితాంచితాస్యంబుతోడఁ
గీ. జుట్టుకొని భక్తి మీఱ శిష్యులు పఠింప
శాస్త్రముల నేకతాయనస్వాంతుఁ డగుచుఁ
జెప్పుచుండె శంకరసుధీసింహుఁ డరయ
దుస్సహం బయి బ్రహ్మతేజస్సు పొలయ. 124.

శా. ఆవిప్రేంద్రుడును బంధువుల్ హితులు దా మంతంత గూర్చుండి నీ
రావప్రక్రియ నాలకింప నిటు శాస్త్రప్రోక్తదుర్భేదస
ద్భావంబుల్ వివరించుచుండెను సుధాధారల్ విడఁ బాఱ నం
తేవాసివ్రజసంశయచ్ఛటలు శాంతింపఁ బటాపంచలై. 125.

గీ. వింటిరే జీవుఁ డారీతి వెనుకభవము
లం దొనర్చిన పాపపుణ్యప్రభేద
కర్మ మనుభవించుచునుండుఁ గాయ మూఁది
మమత వహియించి యదె సాధనముగ నకట. 126.

గీ. అది ప్రబోధసుధాకరమందు దేహ
నిందనప్రకరణము సుండీ, వచింతు
విషయనిందాప్రకరణమ్ము వినుఁడు శ్రద్ధ
ఘోరభవవారిరాశిసంతారకంబు. 127.

ఆ. వెంగలీఁడు దేహి విషయజకర్దమ
మార్జనమ్ము ప్రోలుమాలి మఱచుఁ
బడు గృహస్థధర్మపంకమ్మునఁ దురర
దృష్టదృష్టి విరసవృత్తి యగుచు. 128.

ఆ. ఆలు రూపహీన యగునేని నరునకు
సంతతంబు దుఃఖ మనుచుఁ గలదె
యమితరూపయుక్త యగునేని దనకుఁ గా
కన్యపురుషవశము నందుఁ గాదె. 129.

ఆ. బిచ్చగాఁడొ బంటొ నెచ్చెలియో పర
పురుషుఁ డెవఁడొ కాని యరయు సాభి
లాషదృష్టితో విలక్షణోదారరూ
పవతియేని భార్యవంక నెలమి. 130.

క. తనభర్తకంటె నాసే
చనికాంగుని బురుషు నన్యుఁ జూన యరసి నె
మ్మనమున వానిని వెదకదె
మనమునఁ బురుషుండు పరరమణి వెదకునటుల్ 131.

ఉ. ఆగతి మంజురూప యగు నాలిని జూచి ప్రతిక్షణంబు కో
పాగతిక్షీణుఁడై బలిభుగంతరపాతిబలిక్రియన్ సుఖాం
భోగతిఁ బొందఁ, డా చెలియు యేతరిమై తన యాజ్ఞ మీఱుచో
నాఁగద వైరి మించినది, యన్యుల గోరున దేసి యేమనన్. 132.

క. అనిపలికి దీనిపై వ్యా
ఖ్య నొనర్తును విపులముగ సమాకర్ణింపుం
డని కాంతాగర్హణ మొన
సినభణితమ్ముల నుపన్యసించె నిటువలెన్. 133.

మ. జననం బాదిగఁ జచ్చునందనుక పీసంబేని సౌఖ్యం బెఱుం
గనిజీవుండు దురాశఁ జిక్కుకొని సౌఖ్యభ్రాంతి నాలంచు నం
గన నోర్తున్ గళమందుఁ గట్టుకొని పంకంబందు నిర్మగ్నుఁడై
పసటం జెందుచు దిక్కుమాలి కృశుఁడై వర్తించు దీనంబుగన్.

గీ. సకలశాస్త్రార్థసారవిజ్ఞాతయేని
లేమ వాల్జ్ఞాపులకుఁ జిక్కి లేడిపిల్ల
వలె ననుగమించుఁ గాని గెల్వంగనేరఁ
డని వయస్యులతోడఁ బ్రహ్లాదుఁ డనఁడె? 135.

చ. పరమరహస్యముం దెలియఁ బల్కెడ నెంతటివిజ్ఞుఁ డైన సుం
దరియుఱిగుబ్బచన్గవ గనంబడునంత మనోజకేళిసూ
భరవికలాత్ముఁ డై సుకృతపాపవిభేదవిహీనుఁ డై వశీ
కరణవృథాప్రయాసమునఁ గాటియపాటు వహించు నిస్సిరో. 136.

క. మూత్రపురీషాసృక్కృత
పాత్రములం దేమి సుఖము ప్రాప్తించును స్త్రీ
గాత్రమ్ము ముక్తివల్లీ
దాత్రం బని యెంచి బుధుఁడు దలఁగి చనవలెన్. 137.

శా. భిక్షాన్నాదనుఁడై మహోకట సుషుప్తిం జెదునవ్వర్ణి కం
జాక్షిం జేకొనుటాదిఁ దృప్తి యగునిద్రాహారముల్ లేక చి
త్తక్షోభంబున నిత్యనద్గృహబహిర్ద్వారంబులం జిక్కి త
ద్వీక్షాప్రాప్తికి మోక్షలక్ష్మికిఁ జెడున్ విజ్ఞానవిభ్రష్టుఁడై. 138.

క. "సంసృతిలతికాకందము
హంసగమన దాని నాస నందనివాఁడే
హింసలఁ గాంచఁడు ముక్తవ
తంసుం" డని బలి యనండె దామోదరుతోన్. 139.

గీ. పుత్రకేదారధనధాన్యశత్రుమిత్ర
భావములకు నిదాన మబ్జాతనయన
దాని నొక్కత విడువ నేతత్సమస్త
చింతలు నశించు నాశ్రయాసిద్ధివలన. 140.

సీ. లాలాంబుర్ఝురపరిప్లావితం బగులేమ
మోవి యె ట్లమృతంపుబావి యగును
మసృణచర్మచ్ఛన్నమాంసగేందుక మైన
సతికుచం బెటు సుమ స్తబక మగును
సంకులాంతాంత్రిబద్ధకంకాళ మగుచెలి
దేహ మెట్లు మెఱుంగుఁదీఁగ యగును
దూషికాబాష్పసందోహప్రసవ మైన
చానక న్నెటు సరోజాత మగును
గీ. అహహ! పాదాదిశీర్షపర్యంత మరయఁ
గుణలవము గోచరము గాని కొమ్మఁ గాంచి
పురుషుఁ డాసాస వెంబడి పోవు టెన్నఁ
గామినీమూత్రగర్తసంగతికిఁ గాదె. 141.

క. అని యిటు శిష్యులమనముల
కును హత్తనుపన్యసింపఁ గూర్చుండిన వా
రనుమానించుచుఁ బరిణయ
మనఁజాలక యతనిసత్క్రియలఁ జేకొంచున్.142.

ఉ. సంబర మెల్ల డిందువడఁ జల్లఁగ వారలు సేరవచ్చి యా
ర్యాంబకు నయ్యుదంతము సమగ్రముగా వినిపించి జన్మప
త్త్రంబును బుచ్చుకొంచు విశదంబుగ నయ్యది చూచి లేశమా
త్రంబు ముదంబు చూప రధరంబు మెదల్పర మిన్నునూచుచున్.

శంకరుఁ డల్పాయు వని తల్లి విలపించుట.

చ. అది గని యాసుధీజనని యాత్రముతో "నది యేమి తంత్రలా
ర! దయ వహించి చెప్పరె చిరంబుగ నాయువు గల్గి సర్వసం
పదల మదాత్మజాతుఁడు శుభంబులఁ బొందునె" యంచుఁ బల్కన
మ్ముదితభయంబుఁ గాంచియు నమోఘవచస్కుఁడొకండుదా ననున్.

సీ. చదువు నీతఁడు వేదశాస్త్రముల్ సగహాస్య
మఖిలవిద్యలు నేర్చు నరయుమాత్రఁ
బాండిత్యసామ్రాజ్యపట్టాభిషిక్తుఁడై
యెదురు లేక జగంబు నేలఁగలఁడు
యశముచే సర్వదిగంతవిశ్రాంతుఁడై
పరిపంథితతిఁ బాఱఁబాఱఁ దఱుము
జ్ఞానామృతమ్ము పైఁ జల్లి సంసృతికర్ద
మోద్విగ్న మగులోక ముద్ధరించు
గీ. శాశ్వతగ్రంథరచనావిశారదుఁ డగుఁ
జక్రవర్తిత్వమో లేక సంన్యసనమొ
యొందునట్టిమహారాజయోగ మొనసె
నన్నియును లెస్సకాని యే మందు నమ్మ! 145.

ఆ. అనుచు నంగుళమ్ములను లెక్కయిడి యుత్త
మాయు వరయ, మధ్యమాయువేని
గానరాద, యని సగంబు సగంబు మ్రిం
గుచు వచించె నామె క్రుంగి పోవ. 146.

ఉ. ఆద్విజుఁ డాప్తబంధుయుతుఁడై చనె వచ్చినత్రోవఁబట్టి; యా
పద్విచలన్మనోబ్జ యయి పైదలి యంతట వంత మున్గ, యా
పద్విషయంబు శంకరుఁడు వచ్చి యెఱింగి సవిత్రిఁ బల్కు సం
విద్విభవాభిరామపదవీలలితోక్తుల శాంతియుక్తులన్. 147.

మ. జననీ యిట్టు లకాండశోకమును గాంచన్ ధర్మమే? కర్మ మే
మని శాసించినఁ దప్పునే ప్రబలవాతాఘాతనిర్ధూతకే
తనచీనాంశుకకోటిచంచలము గాదా దేహ? మేమూర్ఖుఁడున్
గనునే సుస్థిరబుద్ధి దానియెడ వక్కాణింపు మా దన్నచోన్. 148.

క. సుతు లెందఱొ సతు లెందఱొ
గతజన్మంబులను బొందఁ గంటివొ నీ కా
సుతసతు లిపు డుండిరె సం
సృతిసంగము పాంథసంగమే కద జననీ. 149.

క. ఉపచయగతి దేహంబై
యపచయగతి నదె శరీర మౌ నని బుధు లం
ద్రుపచయము నపచయం బీ
ప్రపంచమున సంతతప్రవాహములు గదా. 150.

ఉ. ఈనవరంధ్రముల్ గలమెయిన్ బవనం బెటు లిన్నినాళ్లు దా
నై నిలువంగఁ జాలె నని యచ్చెరు వొందఁగ నొప్పు గాక యే
దే నొకఛిద్రమందుఁ బడి యేఁగుట చోద్యమె? యిన్నియున్ గృతాం
తాననపంక్తిగాఁ దలఁపుమా వలపున్ విడునాడు దీనిపై. 151.

క. మృతియే దేహంబునకుఁ బ్ర
కృతి యని జీవించుటే వికృతి యనియు మహా
మతు లనుట వివేకించిన
ఋతము; జగద్విపరిణామ మెవ్వం డాఁపున్. 152.

క. నేఁడో రేపో మఱి యే
నాఁడో యీదేహవితతి నశియించుఁ గదే
నేఁ డైన ఖేద మింకొక
నాఁ డైన ముదంబు గలుగునా నాతల్లీ. 153.

గీ. మర్త్యులు శతాబ్దినడుమున మాసిపోన
మర్త్యులు యుగాంతమున నేని మఱియు వార
కాలమునఁ దారతమ్యంబె కాని మృత్యు
వొందనట్టివాఁ డొక్కఁడు మృత్యుంజయుండు. 154.

చ. తరతర మామహేశు నమృతత్వనిదాను నుపాస్తి సేయ దు
స్తర మగుమృత్యువుం గెలువఁజాలుదు మంతియకాని యిట్లు దు
ర్భర మగువేదనన్ బొరసి ప్రాణము గావఁగలారమమ్మ నీ
తర మగునేని నాకు నమృతత్వము గాంచ వరం బొసంగుమా. 155

క. విను మొకనుడి కైవల్యో
పనిషత్తు వచించు "నమృతభావము త్యాగం
బున నగుఁ; గర్మమునఁ బ్రజా
ధనములఁ జేకూర దనుచు ద్రఢిమ మెలర్పన్. 156.

శంకరుఁడు సన్యసింపఁ దల్లిని గోరి నిరాకృతుండగుట.

చ. భ్రమనశతన్ భవాధ్వమున బమ్మరిలన్ సుఖలేశసంగ్రహం
బమరదు సర్వసంగపరిహారముగాఁగఁ దురీయ మైనయా
శ్రమమును బూని శంభునిఁ బరాత్పరునిం భజియించి జన్మ మ
ర్థము గన నీయనుజ్ఞ నమృతత్వము గాంచఁ దలంతు నంబరో. 157.

మ. అని సంన్యాసజిఘృక్షుఁ దెల్పునుడు లల్పాయుష్కుఁ డన్మాటకం
బెను నిర్ఘాతనిపాతమై ధృతిగిరిన్ ఛేదింప ఖేదంబుతో
నను "నాతండ్రి యిదేటివాంఛితము? ప్రాణం బున్నయన్నాళులే
ని నన్నున్ గాచుచునుండకుండ నెటకేనిన్ బోదె సంన్యాసివై. 158.

గీ. మాను మీబుద్ధి, యాలింపుమా కుమార!
పూని గార్హస్థ్యమును, గాంచి పుత్రకులను,
జేసి క్రతువులఁ బొందు సంన్యాస మపుల,
నిదియ సత్సంప్రదాయ మం చెఱిఁగి కొనుము. 159

చ అకట! త్వదేకపుత్రను గదా బ్రదుకంగలదాననే నిన్నున్
వికలత వీడినేను మరణించినచో నెపరయ్య యౌర్ధ్వదై
హికవిధు లాచరింతు రతివృద్ధ నన్నున్ విడనాడిపోవుకో
రిక యెటు గల్గె, సర్వము నెఱింగియు నీకిఁయ జాలిమాలితే. 160

ఉ. నావుడు శంకరుండు కరుణంబుగ నేడ్చెడుతల్లిఁ జూచి చిం
తావిలచిత్తుఁడై జననియంగద నెల్ల నిరస్తమోహ వా
చావిసరంబుచే నుడిపి సర్వవిధిజ్ఞుఁడు గాన నొంటిమై
భావమునం దిటుల్ దలఁపఁ బొల్పడె నెన్మిదియేండ్లయీడునన్.

గీ. సంసృతిని రోసె నామానసంబు మిగుల
విడఁవజాలక తల్లి తపించు నకట!
యెటులో యొప్పించి చన నింత యెంతుఁ గాని
బుద్ధిఁ దలపోయ ధర్మవిరుద్ధ మిద్ది. 162

క. ఏయహము విరక్తుం డగు
నాయహమ పరివ్రజించు టది విధి యని యా
మ్నాయమ్ము తెలుపు టెఱుఁగనె
యీయమ యశరణ్య వృద్ధ యేడ్చుట కెంతున్. 163.

క. అని మనమున యత్యాశ్రమ
మును గొనఁగా నిశ్చయించి మోమున భేదం
బును జూపక సేవలఁ ద
జ్జనయిత్రిని దనిపెఁ దగ యథాపూర్వముగన్. 164.

ఉ. ఆయమ కోర భాగవతమందలిపుణ్యకథానకంబు లా
ప్యాయన మొప్పఁగాఁ జదివి యర్థము సెప్పి తదీయఖేదమున్
బాయఁగ దట్టి సమ్మదమునన్ హృదయాబ్జము పల్లవించి నా
రాయణనైకరూపచరితామృతసేచనపూరితంబుగాన్. 165.

సీ. జనకుఁ గా దని నృసింహుని జేరుప్రహ్లాదు
ననితరసామాన్య మైనభక్తిఁ
బసిపాపఁ డయ్యుఁ దపఃపటిష్ఠత ముకుం
దునిపదం బంటిన ధ్రువునిశక్తి

నిస్సంగుఁడై గోచినేని దాల్చక విరా
గకళావతార మహాశుకువిరక్తి
సంగదోషమున సారంగమై విప్రుఁడై
తరియించు నాజడభరతుముక్తి
గీ. సాంద్రమోదాశ్రురోమాంచజడిమఘర్మ
ముఖ్యసాత్త్వికభావసముద్రితాంగుఁ
డగుచు భాగవతపురాణ మంబకొఱకుఁ
జదివి వివరించె నా రేయి శంకరుండు. 166.

క. భాగవతమందుఁ జదువువి
రాగులచరితములు హృదయరాజీవమునన్
మూఁగి యళులట్టుల మొరయ వి
రాగము ముప్పిరిగ దృఢతరంబై పొదలెన్. 167.

మ. "గురు వెవ్వం డగునో? లభించునొకో నాకున్ బ్రహ్మవిద్యాధురం
ధరభావ" మ్మనుచింతచేఁ గొడుకు "వృద్ధన్ నన్ను బోనాడి కె
చ్చట యత్యాశ్రమ మూనునేమొ సుతుఁ" డం చార్యాంబయున్ గన్నుమూ
యర యాఁరాత్రి, సుషుప్తికిన్ రిపులుచేతో నంతచింతల్ గదా. 168.

గీ. ఎట్టకేలకు నిద్రించి రిరువు రరుణుఁ
డుదితుఁ డౌతఱి లేచి శిష్యులను గూడి
శంకరుం డేఁగె నదికి సిస్నాసు వగుచు
సుప్త యగుతల్లి యింట నేడ్చుచును లేచె. 169.

చ. అటువలె మేలుకాంచి కలయన్ నలుదిక్కులు సూచి యింట నె
చ్చట సుతుఁగానలేక తనుసంధులు వ్రీలఁగ ముక్తకంఠయై
యలమట నేడ్వఁజొచ్చె నదియుం దవగాహ మొనర్చుచున్నయ
వ్వటువులఁ గూడి శంకరుఁ డవార్యగతిన్ బఱతేర నింటికిన్. 170.

శా. ఆరీతిన్ హృదయంబు జాఱ నిది యే మమ్మాయటం చంబికన్
జేరన్ వచ్చుకుమారుఁ గౌఁగమున సంశ్లేషించి నాతండ్రి క
న్నారన్ నిన్ననఁగంటి, మంటి వెటు లవ్వా! డెంద మిందారఁ గం
గారై నీ రయిపోయెఁ బ్రాణము గళాగ్రప్రాంతమై యాడెడిన్. 171.

క. తనయా యది స్వప్నం బని
నినుఁ గని యనుకొనుచునుంటి నిజమనుకొని పొం
దినవగకు మేర గలదే
మనుమా యతి వగుచునే నమందాయువ నై. 172.

గీ. అనుటయు వితాకు గదుర నయ్యనఘుఁ డాత్మ
నిట్టు లీయమ యిటు తెగియించెనో కో
యనుకొనుచు నమ్మ దాని కే మల్లస్వప్న
మంతయు వచింపు మనుడు నార్యాంబ పలుకు. 173.

సీ. పరిపూర్ణవారినిర్ఝర మౌచుఁ బూర్ణాత
రంగిణి మిన్నంటఁ బొంగినట్టు
లానదీపూరమం దవగాహ మొనరింప
నేను నీచేయూఁత నేఁగినట్లు
కటిదఘ్న మగునుదకములనే నీరాడు
చుండిన ట్లీ వీఁదుచుండినట్లు
వలదు రారమ్మని పలుమఱే నన్నట్లు
లీ వీఁదుచును లోని కేఁగినట్టు
గీ. లంతలో నీపదాగ్ర ముగ్రాకృతి యగు
నొక్కమకరంబు పట్టిన ట్లుపతపించు
చనుమతింపు మిష్టేని సంన్యాసమునకు
నంచు బల్కిన యటు కలయందుఁ గంటి. 174.

ఉ. కొండఁ బెయి మాళిఁ గూలినటు కొండొక నిల్చి తపించు చెంతరా
గుండియదానవో కద యొకొండు వచింపక మిన్నకుండ న
శ్కాండములం బుటుక్కు మని కన్గొనుచుండ మునింగి లేచి నా
కొం డన కానతీవె యని యుక్కటి మున్గినయట్లు గానరాం. 175.

ఉ. కోరిక దీఱకుండఁ బ్రతికూలమ్మృతిం గన నేల తండ్రి నీ
కోరిన యాశ్రమంబె కయికొంచు సుఖంపఁదుమంటిఁ గాని వాః
పూరమునందు మాయమయి పోఁ గని యక్కట పుత్రి మ్రింగితిం
గోరిక దీర్పనైతి నని కుందుచు నెవ్వఁడు గానగామికిం. 176.

ఆ. అొమ్మ చఱచుకొనుచు నెమ్మోము నొదల
మోదుకొనుచు బాష్పపూరమగ్న
నగుచుఁ దీరభూమి నడలుచున్నటు పాడు
గలను గంటి మేలుకంటిఁ దుదకు. 177.

క. మేలుకొని యేడ్చుచు నె నలు
మూలలు గృహ మరసి నీదుపోఁకిమి గనమిం
గాలుం గే లాడక యిలఁ
గూలితి నే మందు నిన్నుఁ గోల్పోయినటుల్. 178.

క. అని యేడ్చుచుఁ గంఠము వీ
డనిజనని మొగంబు నిజపటంబున నొయ్యో
య్యన నొత్తుచు నిటు లను, న
య్యనఘుఁడు దైవంబుచేత కబ్బురపడుచుం. 179.

శా. తల్లీ! యేటికి శోక మొందెదవు నాదైవమ్మె నీస్వప్నమై
తెల్లం బౌనటు తెల్పెఁ గాంచుము స్రవంతీరూపసంసారమం
దుల్లోలంబుల దుస్స్పృహామకరక్రీడోత్పాతినై మున్గి యా
పల్లుప్తాసువు గాఁగ నుంటి ననుభావం బందు దీపింపదే. 180.

శంకరుండు సన్యసించుట.

క. అని జననీభుజబంధా
బుననే భవబంధ మూడిపో సంన్యాసం
బును మానసికముఁ గొనె నో
య్యన "సంన్యస్తం మయా" యటంచు రయమునన్. 181.

ఆ. తెల్లఁబోయి తల్లి యుల్లంబు జల్లన
నెంతపని యొనర్చి తింతలోన
శోకవశత నంటెఁగాక నీవిపత్రియో
గంబు సైఁపఁగలనె కన్నతండ్రి! 182.

శా. నా కెవ్వా రిఁక దిక్కు పుత్రిక! నినున్ గాపాడి నీపాత్రపున్
జేకొందున్ సకలోపచర్యలు జరాజీర్ణాంగి నై నప్పు డం
చాకంఠంబుగఁ గోరుకుల్ గలిగి కాదా నాఁడు నీతండ్రితోఁ
బోకున్నా; నెటుగాక యుండ నడవిన్ బోఁ దోసి పోనుంటివే.183

క. శారీరపాటవముతో
ధీరతయుఁ దొలంగె నిట్టిదీనావస్థన్
భారము నీకే యగునెడ
నేరికిఁ గాకుండుఁ దండ్రి యేర్పడఁ జెపుమా. 184.

క. నా విని యామాటలకుం
భావము చలియింప కతఁడు పల్కెను మమతా
భావ మభావ మ్మయి చెడ
నేవంవిధమధురమృదులహితభణితములన్. 185.

ఉ. ఏల విలాప మొంద జననీ! భవ మీఁగి బయల్పడంగ? నా
భీలదవానలార్చిరభివేష్టితవాసనికుంజనిష్క్రమో
ద్వేలభయాకులైణముగతిన్ మన మల్లల నాడిపోవ, నె
వ్వేళనొ సంన్యసింప కెటు వీటిడినై చెడఁజూతు నెంచుమా. 186.

క. కలలో ననుజ్ఞ యిడు ట
వ్వాలఁ బెట్టుము నన్నుఁ గాంచి పలుకవె 'యతివై
యిల బ్రతుకు', మనుచు నిప్పుడు
కలఁగెద వేలమ్మ పోవఁగా నే నుండన్. 187.

గీ. పుత్త్రుఁ డనెడివ్యామోహమ్ము పొందుకతన
నింత దుఃఖింతు గాక యొకింత తత్త్వ
మరసి యిటు సంన్యసించునా కర్తవ్యకృత్య
మెదియొ శాసింపు మఖిలమ్ము నెఱుఁగు దీవ. 188.

శా. నీదేహంబు రుజావశం బగునయేనిన్ గాతు రర్థోపచా
రాదిన్; మృత్యువశంబ యానెడ యథార్థప్రక్రియన్ సంస్కృతుల్
భేదం బెంచక చేయువారలు ధనాప్తిన్ సత్ప్రజాభీతి దా
యాదుల్ వీరలు, నమ్మ మింక భయ మేలా నీమదిన్ దల్లిరో.

క. రేవైన నగ బలేనియు
నేమెడఁ గానిమ్ము నీకు మృతి యొదవెడుచో
నామెడ నను మదిఁ దలఁచినఁ
బాయక యరుదెంచి పరమపద మొందింతున్. 190.

క. కొడుకు యతి యైనచో జనకులకు నంత్య
సంస్క్రియలు లేకయున్న మోక్షమ్ము కలుగు
నేదియో లోక మొంది యం దెల్లపుణ్య
మలిన భువిఁ గూలుపీడ నీ కమ్మ యేల? 191.

గీ. విధవ ననదను నను నింట విడిచి సుతుఁడు
సంన్యసించెనె యని కుంది జనదు నీకు
నిచట నే నున్న నీ వొందు దెట్టిఫలము
దానికి సహస్రగుణఫల మ్మొనఁగలవు. 192.

చ. అని జననిన్ వచించి వినయంబున జ్ఞాతులఁ బిల్చి సంన్యసిం
పను గడుదూర మేఁగెద సమస్తము మత్పితృవిత్తమున్ గ్రహిం
చి నెనరు పూని వృద్ధదశఁ జెందె యనాథగ నున్నకన్నత
ల్లిని నరయుండటంచు ముకుళించిన కేల్గవ వేడి యెంతయున్.193.

గీ. అనఘుఁ డాతండు మమత నహంత వీడి
బాష్పపూరమ్ము లొలుకు నంబను దదీయ
నికటమునఁ బెట్టి జనని సంతృప్తిపఱచి
సవిధవిష్ణ్వాలయము సేరఁ జనియె భక్తి. 194.

చ. చని యదునందనాంఘ్రిజలజంబులకుం బ్రణమిల్లునంత నో
య్యన యశరీరవాణి విన నయ్యె "భవజ్జననీహితార్థ మా
జనపతి దెచ్చుని త్తటినిసారణి భంగము లీతటంబు భే
దన మొనరించె దేవళము తప్పక కూలు" నటంచు బోరునన్.195.

శా. ఆశ్చర్యంబున మున్ని కేరళనృపాలాగ్రియు రాఁ బాచి "చే
తశ్చింతాపరిపూరకుం డగు ముకుందస్వామి నీ; శాపగాం
భశ్చంగచ్చటులోర్మిభగ్నతటసంవాసాతిబిభ్యత్తనం
తశ్చింతల్ దొలఁగన్ స్థిరంబుగ గుడిన్ గట్టింపు మోభూవరా.196.

క. అనుడు మును త దాదేశం
బునఁ గ్రతు వొనరించి కామమును బడసిన యా
జనపతి యప్పుడ కట్టిం
చె నబాధక మైనచోట శ్రీహరికి గుడిన్. 197.

వ. అంతదాఁక శంకరుం డద్దేవళంబుననె ముకుందు నుపాసించుచు నిలిచియుండి నిజకరంబుల నాకృష్ణవిగ్రహ ముద్ధరించి మూఁపున భరించి తెచ్చి నూతనాలయమునఁ బ్రతిష్ఠించి చిరంబు సుఖం బుండు మని ప్రార్థించె నంత. 198.

క. జగతీసముజ్జిహీర్షుం
డగు పుత్త్రుచరిత్ర మరసి యార్య యవిద్యన్
డిగ విడచి యనుమతించియు
వగ పొందును మరల మాతృభావమ్రదిమన్. 199.

గీ. తల్లిచే యదుకులదైవతంబుచేత
నతఁ డనుజ్ఞాతుఁడై భవ మంద రోసి
సంన్యసింప సుమూరము చనఁ దలంచె
నాస్థితుం డెంచునే యబ్ధినడుమ దుముక. 200.

శంకరుఁడు బ్రహ్మోపదేశము గోరి యేగుట.

క. ఈరీతి మాతృమాధవ
కారుణ్యము వడసి విగతకామ్యార్థుండై
కూరిచి మదిఁ గృష్ణపదాం
భోరుహముల నతఁడు గేహమును విడిచి చనెన్. 201.

గీ. రూఢిఁ దైన్యయుఁబకాపరరూపుఁ డతని
యెదుటఁ గాముఁడు నిలువలేఁ డింత యనిన
నమ్మహానుభావున కెట్టు లంటుఁ గామ
మూలసంసారపాశబంధా లొకింత. 202.

ఉ. మున్ను విధుండు ధాత స్మరమోహితులై చని రుత్పథంబునం
దన్నన మోహినీకచకుచాదుల నేనును గాంచి వెంబడిన్
సన్నకసన్నఁ బోతి నని శంభుఁడె నేఁడు స్మరార్తివార్త కా
సన్నుఁడు గానిభిక్షు వగు జాడ నకాముఁ డతండు రంజిలెన్. 203.

క. సురపూర్వామరవిద్యా
ధరనరగంధర్వులకు మదం బడఁచెనుశం

బరవైరిం గెలిచిన శం
కరుఁడు మునిస్తుత్యుఁ డగుట కనఁ జిత్రంబే. 204.

మ. ఎట వైరాగ్య మతండు ము న్గనెనొ కానీ, శాంతికిన్ లోఁగె హృ
త్స్ఫుట, మడ్డిన్ గమనాదికక్రియల సొంపున్ దాంతి, పాటించె వి
స్ఫుటమౌ క్షాంతిమృదుత్వ, మయ్యుపరతి న్బోధయెన్ హృషీకార్థసం
ఘటనం, బింక సమాధి ధ్యానవితతౌత్కంఠ్యమ్ము చేకూరిచెన్.

ఉ. తీఱనివేడుకన్ విధివితీర్ణకృతాత్మతనుస్థితిన్ గృహో
దారమమత్వముల్ విడిచి తత్పరతన్ శివు నిల్పి మానసా
ధారమునందుఁ దా విజనతాలలితాయనమానపూరితా
పారముదంబునన్ జనియె భారము దూరము నాక యెక్కటిన్. 206.

గీ. పోవుచును మార్గమున వనమ్ములను నదుల
నగపురగ్రామనివసజ్జనంబు గనుచు
బ్రహ్మమే యైంద్రజాలికుపగిది నద్భు
తేంద్రజాలము సూపు నం చెన్ను మదిని. 207.

గీ. దండితాఖలకాపథమండలుఁడు జ
గద్గురుఁడు దండ మూనెను గరమునందు
వాదినివహంబు నిజనిజాధ్వముల కీడ్చు
నలజరద్గవిఁ దన త్రోవ మెలపుకొఱకు. 208.

శా. దండం బూని యతండు కావనియెడన్ దైన్యంబునన్ వైదికుల్
కొండల్ పట్టరె విశ్వకద్రుతతి లేఖ్యంబో లె? నుచ్ఛృంఖలా
ఖండాహంకరణాన్యమర్మవిభిదాకాండూలజిహ్వోగ్రపా
షండాఘాతము నొంది కుందుచును బెల్చన్ గాందిశీకాత్ములై. 209.

శంకరుఁడు గోవిందయతికడ కరుగుట.

ఉ. ఇందుభవానదీతటి రహించుచు శాంతినిశాంతమైనగో
విందయతీంద్రునాశ్రమనివేశముఁ గావులు దాల్చి మైఁ, గరం
బం దోకదండ మూఁది కదియం జనె శంకరుఁ డస్తశైలమా
లిం దివసావసానమున లీల ఖరాంశుఁడు చేరె నయ్యెడన్. 210.

గీ. తటకుజాయాతవాతపోతముల సేద
యణఁగ నాతఁడు ధృతవల్కలాజినవిట
పములఁ దరువులు మునులవాస మని తెలుపఁ
గనియెఁ గోవిందయతితపోవనము వేడ్క. 211.

గీ ఆయతీంద్రునియుపదేశ మందఁగోరి
యచటియతు లెల్లఁ దెలుప నాయనఘుఁ డెఱిఁగి
యరసె బ్రాదేశమాత్రవివరము ద్వార
మైనగోవిందసాధుగుహాలయంబు. 212.

క. ఆరసి ప్రసన్నసమ్మద
కారి యగు యతీంద్రుగుహకుఁ గావించెను ము
మ్మాఱు ప్రదక్షిణనతు లటఁ
జేరి మునులు వినఁగ వినుతి సేసెను భక్తిన్. 213.

క. పక్షీంద్రధ్వజుపా న్పయి
త్ర్యక్షుపదాంగదము నై సహాబ్ధిధరణీభృ
త్కక్షితిఁ దలఁదాల్చు మహో
చక్షుశ్శ్రుతినాథరూపు సన్మునిఁ గొలుతున్. 2.4.

గీ. నిజసహస్రముఖీతేజోజనితభయమునఁ
బఱచిరే శిష్యు లని దానిఁ బాసి యేక

వదనమున శాంతుఁడై శిష్యపటలిఁ బ్రోవ
నిల జనించు పతంజలి వీవ కావె. 215.

ఉ. అల్ల పతంజలిన్ గొలుచునప్డు ప్రమాదముసేసి శప్తుఁడై
కల్లరి రక్కసుం డగునొకానొకపండితుఁ గొల్చి భాష్యముల్
గోళ్ల వటద్రుపత్త్రములకోటి లిఖించియు లేఁగ మేయుటన్
జిల్లులు వోవఁ బూరణము సేసి మహిన్ వెలయింతు వీవకా. 216.

గీ. అవనివివరమునని యధోభువన మొనసి
తన్మహాభాష్యమును యోగదర్శనమ్ము
శేషఫణిసన్నిధిని విమర్శించి వసుధ
వితత మొనరింపవే జగద్ధితము గోరి. 217.

ఉ. వ్యాసతనూజుఁ డౌశుకమహామునిశిష్యుని గౌడపాదు నా
యాసము రోసి కొల్చి పరమార్థ మెఱుంగువిస్ఫురత్వరపరిభా
వాఽసము శాంతివాసము దయాంబుధి నిన్ను భజించి బ్రహ్మసం
స్థాసుఖ మొంద నీచరణసన్నిధిఁ జేరితి నంచు భక్తితోన్. 218.

మ. అనఘుం డాతఁ డిటుల్ నుతింపఁగఁ దదీయాదృష్టశక్తిన్ సమా
ధినిరుద్ధస్థితి వాసి చిత్త మలరన్ దెల్వొంది 'యెవ్వాఁడ వీ'
వను గోవిందయతీందుఁ బ్రాగ్జనపుణ్యవ్రాతజాతాత్మబో
ధనసంసూచక మైనవాక్కుల ననెం దాంతుం డతం డీక్షియన్.

ఉ. కాను ధరిత్రి, నంబువులు గా, ననలంబును గాను, వాయువున్
గాను, నభంబు గా నెపుడు, గా నిఁకఁ దద్గుణముల్, హృషీకసం
తానము గాను, వాని కెడద వ్వగుచున్ బరమాత్మసంపదన్
బూను శివుండ నేను బరిపూర్ణపరాత్మవిబోధసుందరా! 220.

గీ. అనుచు నద్వైతదర్శనజనితము లగు
శంకరోక్తుల గురుఁడు హర్షంబు చెంది
'కంటిని సమాధిదృష్టి శంకరుఁడె భువిని
నవతరించెఁ ద్వ్యదాకృతి ననుచు వత్స. 221.

క. అని చరణములు గుహాముఖ
మునఁ జూపఁగ శంకరుండు పూజించినతోఁ
డన యాచార మిదియ యని
యనఘుం డుపదేశమిచ్చె నాశిష్యునకున్. 222.

క. పరమాత్మ నెఱిఁగి యుండియు
గురుశిష్యులసంప్రదాయగుప్తికినై శం
కరుఁ డాత్మవిద్యఁ గన న
గ్గురునకు శుశ్రూష సేసి కూర్చెను దృష్టిన్. 223.

—• గోవిందయతి శంకరునకు బ్రహ్మోపదేశము సేయుట •—

గీ. భక్తిపూర్వాచరిత తత్సపర్యలకును
ముదితుఁడై యుపదేశించె సదమలాత్ముఁ
డై నశంకరునకుఁ జతురాగమాంత
గతమహావాక్యముల నిట్లు యతివరుండు. 224.

'ప్రజ్ఞానం బ్రహ్మ'

గీ. కాంచ విన మూరుకొనఁగ బల్కఁగ రుచుల
నఁగతి యెఱుంగఁ జాలుప్రజ్ఞాన మేది
తనకు; నదె బ్రహ్మ మనునర్థమును వచించు
ఋజ్నిగమశేఖరోక్తి యెఱింగికొనుము. 225.

'అహం బ్రహ్మాస్మి'

గీ. ఆత్మవిద్యాధికారి దేహంబునందుఁ
బూర్ణ మగుబ్రహ్మ 'మే' యనుబుద్ధిఁ బూని
సాక్షి యగు, నయ్యదియ బ్రహ్మసంజ్ఞ మనుయ
జుర్నిగమ శేఖరోక్తి నెంచుము మనీష. 226.

'తత్త్వమసి'

గీ. తత్పదార్థంబు బ్రహ్మమ్ము, త్వంపదార్థ
మజ్ఞుఁ డగుజీవుఁ, డదె యైతి వనుచు నైక్య
మును ఘటించెడి 'అసి' యని వినుచు సామ
వేదశేఖరవాక్యంబు వినుము దెలియ. 227.

'అయ మాత్మా బ్రహ్మ'

*గీ. స్వప్రకాశాపరోక్షత వరలునదియ
యాత్మ యనఁగ నహంకార మాదిదేహ
మవధి యగుదానికంటె వే ఱగును బ్రత్య
గాత్మ యనియె నథర్వవేదాంతసూక్తి. 228.

వ. అని మహావాక్యచతుష్టయం బుపదేశింప శంకరునకు నం దార్చం బగు 'ప్రజ్ఞానంబ్రహ్మ' యను మహావాక్యముచే 'అథాతో బ్రహ్మజిజ్ఞాసా' యని బ్రహ్మమ్మునందు సకలవేదాంతములకుఁ దాత్పర్యపర్యవసానంబు వర్ణించిన వైయాసకసూత్రగ్రంథమందలి ప్రథమాధ్యాయ మంతయుఁ గరతలామలకంబయ్యె. యాజుషంబగు "అ

---

*గీ. స్వప్రకాశము ప్రత్యక్ష మప్రమేయ
మయి యహంకార మాది దేహాంత మైన
దదె 'యిది' యనఁగ వెల్గు బ్రహ్మం' బనెడున
థర్వవేదావతంసోక్తి తత్త్వ మెఱుఁగు.

హం బ్రహ్మాస్మి" యను మహావాక్యమున నహంకారోపలక్షితం బగునాత్మకు బ్రహ్మత్వవిధానమునెడఁ గలుగువిరోధముల నెల్ల సర్వప్రమాణావిరోధముగా వారించి సమన్వయించిన ద్వితీయాధ్యాయ మంతయు హృద్గతంబయ్యె. సామవేదోదితమగు 'తత్త్వమసి' మహావాక్యమునఁ జీవబ్రహ్మాభేదంబునకు సాధనం బగు తృతీయాధ్యాయ మంతయు ముంజేతికంకణం బయ్యె. మఱియు నాధర్వణం బగు 'అయ మాత్మా బ్రహ్మ' యను మహావాక్యమువలన నిత్యాపరోక్షం బగుప్రత్యగాత్మకు బ్రహ్మత్వంబు చెప్పి యవిద్యాధ్వంసన మొనర్చు చతుర్థాధ్యాయమందలి యర్థ మెల్ల విస్పష్టం బయ్యె నిట్లు. 229.

గీ. సాంప్రదాయికవ్యాసవిజ్ఞాతృసూక్త
సూత్రమతగతి ననుసరించుటఁ గృపాళు
వైన తన్మౌని శాస్త్రగూఢార్థజాత
మిద్ధగతి శంకరుఁడు సూక్ష్మబుద్ధి నెఱిఁగె. 230.

సీ. నారాయణునకు మున్ నలినగర్భుఁడు పుట్టె
నతఁడు గాంచెను వశిష్ఠాఖ్యమౌని
నతనికి శక్తి నా సుతుఁ డుద్భవించెఁ గాంచెను బరాశరుని నమ్మునివరేణ్యుఁ
డతనికిఁ గల్గె సత్యవతియందు వ్యాసుఁ
డామహర్షికి సుతుఁ డయ్యె శుకుఁడు
శుకమహామునికి శిష్యుఁడుఁ గౌడపాదుఁ డా
తనికి గోవిందనాథర్షి శిష్యుఁ
గీ. డట్టిగోవిందయతిశిష్యుఁ డైన పరఁచి
వడసెఁ బాతాళగతఫణిపతికటాక్ష

సముపలబ్ధమహాశబ్దశాస్త్ర మెల్ల
గురుకటాక్షమ్ముకల్మి శంకరుఁడు తాల్మి. 231.

గీ. ఇటుల ప్రాగ్జన్మపుణ్యసుఘటము నున్న
తంబు హంసాదికార్చ్య మాస్థాన మైన
యంతిమాశ్రమ మాశంకరార్యుఁ డొంది
వెలిఁగె నౌత్తానపాది రంజిలెడుపగిది. 239.

## ఆ శ్వా సాం త ము.

ఉ. అర్దితదుర్దమాచలభిదాత్మజశౌర్య! యజర్యసాదిసా
హార్దవివృద్ధదోర్బలపరాస్తకణేహతికర్తృధూర్తహృ
ద్దుర్దశవక్త్రముఖ్యసురదర్పహృదనీక! కబంధదోర్ద్వయీ
నిర్దయమర్దనోద్యమితనిస్తటశక్త్యనలాహుతాశరా!

క. మాయామానుష! మౌని
ధ్యేయానాద్యంతరంతతేజా! త్రిజగ
ద్గేయా! యాదరవేంకట
రాయామాత్యాత్మరాగరంజితచరణా!

పృథ్వీవృత్తము. త్రయీశిఖరధర్మహార్మ్యతలరోచమానాకృతీ!
వ్యయీకృతసుకేతుపుత్రిసునమీరణోదీరణా!
భయంకరగతిస్ఫురత్పరశురామగర్వఘ్న
స్మరోపశమహేతునిష్ప్రతివిధానరఘుంరఘూనిలా!

ఇది శ్రీ గురుకరుణాసమాసాదితకవిత్వ 'కవితాభూషణ, విద్వ
త్కవిశేఖర' వెంపరాల సూర్యనారాయణనామధేయ
ప్రణీతంబైన శంకరవిజయంబున
ద్వితీయాశ్వాసము.

శ్రీగురుమూర్తయేనమః.

# శ్రీ శ ం క ర వి జ య ము.

## తృతీయాశ్వాసము.

శ్రీప్రియ!యాదరసుబ్రాం
బాహ్నణేశాంతరంగమణిసౌధవిహా
రప్రీణన!మాని తా
ణప్రీణితభావ!పూతనామా!రామా!.

వ. అవధరింపుము.

యత్యాశ్రమము స్వీకరించిన శంకరుని వర్ణనము.

క. యతిపతి యతం డలరె లో
హితశాటీపల్లవాపిహితతనుండై యా
యతసంధ్యారక్తాంబుద
తతిసంఛాదిత తుషారధరకూట మనన్. 1.

గీ. మృడుండె తా నౌట నతం డబోధేభ మడంచి
యుద్యదంభోజబంధు మయూఖరక్త
శాటికారుణ పల్లవచ్ఛద్మమునను
గళదసృక్పూర తచ్చర్మ మెలమిం దాల్చె. 2.

చ. శ్రుతులకుం బూవుందోట యయి సుప్రథితోత్తమహంసనంసదా
యతగతియై త్రిలోకముల కందంగ రానిస్వసత్యధామమం
దతిరతి గాంచి యుంట నితండౌ నలబ్రహ్మ;బృహాక్రియార్థ మీ
యతిమెడ నౌపచారిక మటం చన రాక యథార్థ మయ్యెడున్. 3.

శా. మృద్వేశాంఘ్రిమహాఃఖనిన్ ద్రిభువనం బెల్లన్ మితిన్ బూన్చి సం
పద్వృద్ధిష్యవేళం బాయక యతిప్రాంచద్దశాకారమై
సద్వైరాగ్యమనోజ్ఞమై యమల మాసత్వంబునన్ మించుటన్
'తద్విష్ణోః పరమంపద' మ్మనుచు వేదం బీయతిన్ బేర్కొనున్.

ఉ. భూతివిశేష, గోనివృతి, భోగిసమాశ్రియ, భూతసంగ మో
పేతుఁడు గాకయుఁ దిృపుటభేదనదాహకుఁ డౌటఁ గేవల
ఖ్యాతు దశాతురీయుఁ బరమార్థము ద్వంద్వవిదూరు భావనా
తీతుని వీని వేదశిఖ లెల్ల శివుం డని చేయు వర్ణనల్. 5.

చ. పురుషఫలోరురోపకృతి పూజ్యము- లేదు సువర్ణధర్మ మెం
దరయ మహార్ఘశోజ్జ్వలవిభారిసమేతము పార్థివంబు సా
నరద మిటుల్ సహాయవిరహంబున నష్టపురంబు లోర్చు శం
కరు నిగమాంతముల్ శివునిగా వచియింపక యుండు టేకి్రియన్.

మ. వ్యసనాసార దురంత దుష్కృత ఘనంబై దుర్దమాఘోర తా
మస మాసంన్నృతివర్ష వేళ కెడయా * మార్గమ్మునన్ నిల్చి వై
రిసుధీకీర్తి బిసాంకురగ్రసనపూర్తిన్ హంసవంశోద్ఘ మి
చ్చు సమీచీనతరాశయాప్తి సలరున్ సన్మానసకీ్రడలన్. 7.

ఉ క్షీరము నీరమున్ గలియుచెల్వున బ్రిహ్మజగంబు లేకమై
వే ఔనరింపరానియెడ వేర్పడఁజేసి యశేషదోషదు
ష్పారము లైనశీలవదబుద్ధసుబుద్ధులు శుద్ధిసేసి యొ
ప్పారె నజస్రి మప్పరమహంస, ద్విజాతిలలామ మెంతయున్. 8.

శా. నీరక్షీరనయంబునన్ బుధులకేనిన్ దథ్యమిథ్యావిచా
రారంభం బొనరింపరానియెడ నొయ్యన్ జేయుటన్ శంకరుం
డారూఢిన్ పరహంస యౌ-నటుల సేయన్ శక్తి లేనట్టియొ
వ్వారున్ నింబఫలాశనై కరసికధ్వాంతానుజన్ముల్ గదా. 9.

మ. పటుపున్ బాహ్యతమోహతిన్ గలుగుసర్వప్రాణిదృక్పద్మ,మం
దటకున్ మే లొనరింప మిత్తుృఁడ యగున్-నాళీకబంధుం డగున్
హరియించున్ హితచకృపీడఁ-బరహంసాకారుఁడై యిట్లు శం
కరుఁడర్థిన్ దెలుపున్ మహాత్ములకు జిజ్ఞాస్యార్థముల్ పెల్లుగన్. 10.

---

*మర్యాదయందుండి-పాఠాంతరము.

గీ. సాస్మృతిఁ దొఱంగఁ గోరి హంసత్వ మొంది
యతఁడు గోవిందయతిఁ గొల్చు నవసరమున
విషయములఁ జంచలాచలవృత్తిఁ దెలుపు
కరణి మెఱసెను మేఘ మాకసమునందు. 11.

వర్షాకాలవర్ణనము.

సీ. భువి కిచ్చు మాపుష్పము హరించి తన్నేఁ బా
దముల నంచర్కు నబ్దమ్ము లడ్డె
విషయలోలమనీషిహృది బోధకళవోలె
క్షణికకాంతి మొగిళ్ల శంప మెఱసె
విష్ణుపదాప్తి సుహృత్తులకును బ్రహ్మ
ముపదేశమిచ్చె నానుఱిమె ఘనుఁడు
జ్ఞానగర్వులు యతుల్ నను యజింప రటంచు
నింద్రుఁడు విలు దాల్చి యెక్కె రథము
గీ. క్షోణి సత్వరజస్తమోగుణము లెనసి
మూఁడికము లౌవిలాసముల్ మఱయునట్లు
కుటజకందళబాణాదికుసుమరజము
లలముకొని వనీవాత్య లందంద వీఁచె. 12.

క. ఘనదైత్యులు తిమిరచ్ఛవి
తనువులతోఁ జిత్రచాపతతి ఖరఘోషం
బున విద్యుత్పింగాక్షులఁ
జను దెంచిరి మునుల ధ్యానసవములు సెఱుపన్. 13.

గీ. మిన్నలమి వారిదంబులు మేయువారి
ధారలఁ దొరంగఁజొచ్చె సంతతము నంత

శంకరుం డాత్మమున మానసంబు సేర్చి
యింద్రియప్రవృత్తుల సంగ్రహించికొనియె. 14.

చ. సనయపథంబుగా నుపనిషత్తులు సెప్పెడు సాంత్వవాక్యముల్
దన సహజాభిమానము ఘనంబు చిరాత్తమునేని వీడి యొ
య్యన ప్రియుఁడైనయప్పరమహంసునిఁ జేరి స్పృశింప ధీరవృ
త్తిని గనలేక తోడనె తదీయమనీష యండగె నెందునో. 15.

చ. సమయము రోదసుల్ జలదసంగతిలేని యఖండనైజసౌ
ఖ్యమె తనమూర్తిగాఁ గల చిదభ్రపథంబున సూర్యచంద్రబిం
బములె వెలు గనేర వనఁగా—నచిరద్యుతివల్లికల్ ప్రకా
శము నొకయింతయున్ వెలుఁగఁజాలునె మాటలు వేయు నేటికిన్.

ఉ. మాయఁ దొలంగి నైజమహిమస్ఫురణంబున నద్భుతావహం
బై యతినిర్మలంబు సహజామితశర్మము గుహ్యమున్ స్వభా
వాయితసత్య మాంతరశివం బగునప్పదమందు నేది యా
దేయము హేయ మెద్ది యనుధీ నతఁ డెప్పు డొనర్పఁ జింతనన్.

గీ. తటిదమేయప్రభానుస్మృతంబు మేఘ
మల్లవిష్ణుపదం బొందినట్టిదయ్యు
మలినతం జెందె వర్షాగమమున ననిన
భువి విరాగంబు నెవ్వండు పొందకుండు. 18.

క. సలిలాశయ కలుషతఁ గని
కలహంసలు మానసోత్సుకములయ్యె నెవం
డిలఁ గనఁడో యాశ్రయము సెడ
నలి మానసచింత జీవనస్పృహచేతన్. 19.

గీ. శుభ్రరుచి యాకలానిధి యభ్రవీధి
సాంద్రఘన మాటచేఁ బ్రకాశంబు వాసె

వరలునొకొ మలినాంబరవాసిమైన
యంత నెంతకలావంతుఁ డైన నరుఁడు. 20.

గీ. తతపిపాసువు లైనచాతకము లారఁ
గ్రోలె నుదకంబులను జిరకాలమునకు
ఘనసమాశ్రితుఁ డనువగుకాలమందు
నందునేకద దుర్లభం బమృత మైన. 21.

చ. ఇటు పటులానిలక్షతమహీజము ప్రాణిచయప్రచారసం
కటము పయోదనీలరుచిగాఢము నౌ నలవర్షవేళ న
ప్పటుమతి సుధ్యుపాస్యపదపద్ము గురుం భజియించు చిందుభూ
తటమున నుండె నింద్రియవితానము లోఁచి ప్రమోదమగ్నుఁడై.

చ. తెఱపి గనంగరాక దశదిక్కులు నేకముగాఁ దటిద్రుచుల్
పరఁగ మనుష్యకోటులు కలంగ నభంబున నేన్గుతొండముల్
పరుసన వ్రేఁ గట్టినబెళంగున నమ్మయధార లొప్పఁగాఁ
గురిసెను బంచరాత్రి మతిఘోరగతిం సురరాజు వర్షముం. 23.

—• శంకరుని యష్టవిభూతిసిద్ధి •—

గీ. తీరభూజాళితో నగ్రహారసమితి
నారసి లోఁగొని నర్మదాసరి దమేయ
పూర మొక్కుమ్మడిని బొంగి హోరు మనుచుఁ
బ్రళయకాలాబ్ధియటు మహీతలము ముంచె. 24.

ఉ. తోఁటలు దొడ్లు సర్వవసతుల్ జలపూరనిమగ్న మౌట న
ప్పాటను బెద్దఘోష మొదవం నరనారు లపత్యయుక్తులై
ఱౌట మునింగి దిక్కఱయ కొక్కమొఱం బఱవంగఁగాంచి య
ప్పాటున కుమ్మలించి గురుభక్తుఁడు శంకరుఁ డాత్ర మొందుచుం,

క. గురుఁడగు గోవిందయతీ
శ్వరునచలసమాధి కెట్టిప్రత్యూహము చే
కుఱునో యని వెఱచి తత్పద
సరసిజములు మదిని నిలిపి చంచద్భక్తిన్. 26.

మ. అణిమాద్యష్టవిభూతిసిద్ధుఁ డగునయ్యాచార్యమూర్తిన్ మనో
గణమందున్ నెలకొల్పి తన్నును బరీక్షన్ జేయు రేవాతరం
గిణిపూరంబు కమండలూదరమునన్ గీల్కొల్పి మాన్చెన్ దదు
ల్బణ మెల్లన్; గనె స్వస్థభావము జనం బాబాలగోపాలమున్. 27.

క. అభిమంత్రించి కమండలు
వభిముఖముగ నఱత నొడ్డ నంభోధులకుం
భభవుఁడియాచార్యుని కి స
న్నిభముగ నది గ్రోలె జగము నివ్వెఱపడఁగన్. 28.

ఉ. యోగసమాధినుండి యపు డుత్థితుఁడై గురుఁడున్ జగంబు ల
భాగ్యతులై నుతించుస్వపదాశ్రితు శంకరుఁ జేరి "యింతలో
నీగతి యోగసిద్ధి గను టెంతయు మాకు ముదంబుగూర్చె నే
యోగియు నీక్రియన్ గనునొకో యణిమాదికసిద్ధు లద్దిరా!" 29.

క. అనిగాఢసమాశ్లేషం
బున శిష్యుని గారవించి పొంగుచు మదిలో
ననితరసాధ్యాద్వైతా
వనదక్షుం డయ్యె ననుచు స్వాస్థ్యము వడసెన్. 30.

—॥శరదృతువర్ణనము॥—

క. అంతట మాయ దొలంగి య
నంతానందంబు బ్రహ్మ మగపడినట్లుల్

సంతతజలదచయాప
క్రాంతి నొందవేఁబుష్పవత్ప్రకాశము మహికిన్. 31.

ఆ. నీలకంఠనటనలీలకు భరతవా
క్యంబు కమలకుముదకాశసుమవి
కాసమునకు నాందిగాఁ దోఁచె శారద
వేళ పరమశాంతిలీల మెఱయ. 32.

సీ. విద్యచే విమలమై వెలయుబ్రహ్మముభాతి
శరదాగతి నభంబు స్వచ్ఛ మయ్యె
సదుపదేశముల శిష్యజనంబు యతులట్ల
తనిపె నోషధుల నబ్దములు నీట
మాయికావరణావసాయశుభ్రవిబోధ
గతి మేఘముక్తుఁడై గాల్చె విధుఁడు
మత్సరాదులు వోవ మైత్ర్యాదిగుణముల
ట్లబ్దముల్ దొలఁగఁ బొల్పారె దిక్కు.
గీ. లుదరవర్తిభువనము పదోల్లసితము
మత్స్యకూర్మ మయంబు సంభ్రాంతచక్రి
మగుచు నర్మద పరమహంసౌఘసేవ
మగుట విష్ణుదివ్యాకృతి ననుకరించె. 33.

క. చిరసంభృతజీవన మ
బ్ధరములు ద్విజపంక్తి కొసఁగి త్యక్తతటిత్సం
దర్పులై ఘనవీథి గృహా
శ్రమము విడిచి ప్రవ్రజింపఁగాఁ దొడఁగెఁ దమిన్. 34.

గీ. కౌముదీభస్మచర్చితగాత్రి మొప్పఁ
జంద్రమండలకరక మూసక్తిఁ దాల్చి

క్రిమబంధూకసుమశాటికను ధరించి
యతివిధంబున శరదనేహస్సు వరలె. 35.

క. సంగతహంసము హృతరజ
ముం గతపంకంబు క్షోభముక్తిముక్తి సో
ల్చెం గాసారాంబువు లా
య్యం గంభీరంబు శంకరాత్మ విధమునన్. 36.

గీ. గగన మింపారె శరదభ్రగణపరీత
మగుచు నుజ్జ్వలభానుబింబాంచిత మయి
గంధసారద్రివార్క మై కౌస్తుభాంచి
తం బగుమురారివిపులవక్షంబు పోలి. 37.

క. సముమాధవారు లగుటం గం
జములు విరిసి వెలిఁగె యోగసంపత్తిఁ బ్రఫు
ల్లములై యున్ముఖములునై
యమలము లగు మునులయంతరంగములక్రియన్. 38.

గీ. చిగురుటాకులకావు లచ్చుగ ధరించి
ధూళిభూతి నలంది మధువ్రితజప
మాలికలు వృంతకలికాకమండలువులు
పూని యతితౌల్యమును బొందె భూరుహములు. 39.

గీ. ప్రావృషేణ్యాదినంబులు భవ్యమతులు
ధారణాదుల శ్రవణాదిధర్మములను
గడపి పదపద్మధూళి జగమ్ము పూత
మానలు చరింపఁ దొడఁగి రయ్యవసరమున. 40.

క. గోవిందయతీంద్రుం డం
తేవసదవతంసు బ్రహ్మనిష్ఠితమతి వి

ద్యావల్లభు శంకరుఁ గని
భావమ్మునఁ బొంగి యిటుల బలికెన్ బ్రీతిన్. 41.

గోవిందయతియనుమతిని శంకరుఁడు కాశి కేగుట.

చ. శరదృతు వేగుదెంచెను దిశావలయంబు ప్రసన్నమయ్యె సం
సరణదవానలాంబుధరజాలము వేదకదంబజంబునై
బెరసిన తత్త్వపద్ధతి వివేచనసేసి యెఱుంగుపొంటె స
త్వర మరుగంగదే హరనివానపురీవం మైనకాశికిన్. 42.

వృ. గురుదేవుం డగుగౌడపాదముని నాకుం జెప్పె నొక్కప్డు త
చ్చరితంబుల్ వివరించెదన్ వినుము వత్సా తొల్లి ప్రాలేయభూ
ధరమం దత్రిమహర్షి సల్పె నొకసత్రంబున్ మహేంద్రాదికా
మరజుష్టంబుగ; వచ్చె దానిఁ గన బ్రహ్మర్షివ్రజం బర్మిలిన్. 43.

క. ఆయెడకున్ గృష్ణద్వై
పాయనముని శిష్యగణసమావృతుఁడై వి
చ్చేయఁగ బ్రత్యుత్థాన న
మోయుక్తిని బ్రహ్మసదము పూజ లొనర్చెన్. 44.

మ. ఒనరింపన్ దనివోఁది వ్యాసుఁడు సదస్యుండై సభాస్తారు లా
య్యనఁ గోరన్ శ్రుతిమస్తకార్థము లవేలాద్వైతవిజ్ఞానసా
ధనముల్ పెక్కు లుపన్యసించెను సుధాధారామదాహంక్రియా
హాసనోదారమృదూక్తిసారలహరీ వ్యాపార మేపారఁగన్. 45.

మ. తమసందేహతమంబు దల్చువిమలాద్వైతార్థసిద్ధాంతచాం
ద్రమసజ్యోతులఁ దాపమాఱుట సభాస్తారుల్ నమస్కారపూ
ర్వముగా నిట్లని రైకకంఠ్యముగ దేవా! నీమహత్త్వం బనూ
హ్యము నారాయణదివ్యమూర్తి వని కొండాడున్ గదే లోకముల్ .46

నింద్రియక్షోభమ్ము హింస యాట యభీష్ట
విహరణంబె ధర్మవృత్తి హేతు
గీ. వనుచు స్వేచ్ఛాప్రచారులై యాదిగౌత
మోదితసుశీలమునుగూడ నుజ్జగించి
కేవలము వేదచోదితక్రియల కెదురు
సలుపులె మతంబుగా నాస్తికులు ప్రబలిరి. 13

మ. అది యెల్లం గని యక్కుమారిలుఁ డహింసాదిప్రబోధం బొన
ర్చుదయాళుం డగుబుద్ధదేవుమతముల్ గ్రూరంబుగాఁ జేసి రీ
వదరుంబోతులు పెక్కురై యెటు సహింపన్ జెల్లు నీఁడ దు
ర్మదులన్ వీరి నడంపకున్న శ్రుతిధర్మం బెల్ల వమ్మయ్యెడున్. 14.

మ. మని యాయెన్ గులరీతి వేదము కళామాత్రంబు శేషించె నె
క్కసమాయెన్ జినధూమకేతువుల లెక్కం బెట్ట హా యంచు మా
నస మింతింతగ వ్రీల నాస్తికమతాంతర్వాణులన్ గెల్వ నెం
చి సభారంగములందు నోటువడెఁ దత్సిద్ధాంతమర్మజ్ఞతన్. 15.

గీ. శత్రుపక్షరహస్యవిజ్ఞాత కాక
జయము నెటు పొంద నౌ నంచు సౌగతాగ
మంబు పఠియించుపూన్కిఁ దన్మతగురువుల
నెందఱనొ వేడి వైయర్థ్య మెనసి పొగులు. 16.

ఉ. వైదికకర్మశీలుఁడు సవంబు లొనర్చినసౌనికుండు ఛీ
ఛీ దయమాలువాఁ డని హసించుచుఁ దిట్టుచుఁ బొమ్మటంచు మ
ర్యాద దొఱంగి పల్కుటయు నక్కట యెట్టు లెఱుంగు టంచుఁ జి
త్తాదహనంబు నిచ్చలు మనం బెరియింప సహించె నాత్మలోన్.

క. ఆరీతి గొన్నిదివసము
లోరిచెఁ గానీ జిగీష యుక్తాయుక్తా

చారవిహారుని జేయుఁగఁ
జోరక్రియనేవి జదువఁ జూచి మనమునన్. 18.

కుమారిలుఁడు బౌద్ధాగమము లభ్యసించుట.

మ. "కపటోపాయము సన్నిధైన రిపుమార్గంబున్ గ్రహింపందగున్
గపటిన్ గైతవరీతిచే గెలువ నౌఁగా" యంచు భావించి జై
నపరివ్రాజకవేష మూని యొకజైనప్రాజ్ఞు శుశ్రూషచే
సి పఠించున్ సుగతోక్తిమర్మములఁ దచ్ఛిష్యాంతరాసీనుఁడై. 19.

క. కించిన్న్యూనముగా గ్రహి
యించెను దన్మతరహస్య మెల్లఁ దెలియ, నా
వంచన మెఱుంగకుండఁ జ
రించుచు నుండఁగ నొకప్డు క్రించుఁదనమునన్. 20.

క. ఆగురువు వేదమాతను
వేగతుల వినింద సలుప వీనులు ప్రిదులన్
మూఁగయటు లుండె నైనను
నాఁగక యాసుధికిఁ గనుల నశ్రులు వొడమెన్. 21

గీ. నింద హెచ్చ బుధేంద్రుకన్నీరు వెచ్చ
నయి కణాకృతి నొక్కమా ఱవని రాలె
బౌద్ధమతలక్ష్మి గూడ నప్పట్ల విడిచె
నాత్మసంతుష్టయభీ జనితాశ్రుకణము. 22.

గీ. పాఠము సమాప్తమయ్యె నప్పట్ల నుండ
కెటకొ యాతఁడు సనుదు నచ్చట సతీర్థ్యు
లెల్ల గుమిగూడి 'కనుఁబ్రామి యెవఁడొ వీఁడు
మనరహస్యము లెఱుఁగవచ్చినఖలుఁడంచు. 23.

క. కాదేని మనగురుం డటు
వేదము దూషింప నట్లు విలపించునొకో
వైదికుఁ డగుటయు నిజము ప్ర
మాద మ్మొనరించుపొత్తు మన కంఠజకున్. 23.

క. అని తర్కించి వినిశ్చయ
మున గురునకుఁ జెప్ప నతఁ డపూర్వామర్షుఁ,
బున వీనిని రే నిద్రిం
చినతఱి సౌధంబునుండి క్షితిఁ ద్రోయుఁ డనెన్. 24.

ఉ. నా విని శిష్యు లెల్లరు మనంబునఁ బొంగుచు వల్లె యంచు నా
రే వివశత్వ మొంది నిదురించుతఱిన్ మహిఁ ద్రోయఁ గూలుచున్
దైవవశాన మేల్కొని మొదల్ దలఁచెన్ 'శ్రుతులే ప్రమాణ మా
చో విపులాధిపాతహతి సుంతయుఁ బొంద' నటంచు ధీరుఁడై. 25.

గీ. అటుల తలఁచుచు సౌధాగ్రమందునుండి
పుడమిఁ బడి కీ డొకింతయుఁ బొరయఁ డయ్యె
గాని 'శ్రుతియె ప్రమాణంబ' యేని యనిన
సంశయార్థక మొకకన్ను చదిపి నైచె. 26.

—• కుమారిలుని దిగ్విజయము •—

మ. తొలుతన్ సౌగతు లన్న నేవపడు, నందున్ దన్ను వారట్లు గా
సిలఁద్రోయన్ మఱియింత దాని బలియించెన్ జెప్ప నే మున్న ద
య్యలఘుజ్ఞాని త్రయీవిఘాతకుల మాయంజేయ మాత్సర్యసం
కలితాంతఃకరణంబునన్ వెడలె దిగ్వాటంబు లూటాడఁగన్. 27.

శా. క్రౌంచారాతి వతార మన్న ప్రథంశో రాజిల్లుచున్ భట్టపా
దాంచన్నామమునన్ జెంచు చరణన్యక్కృతం బౌజగం

బించన్ జేయుసహస్రరశ్మివలె గౌరీశాజ్ఞ ధాత్రిన్ వెలా
రించెన్ జైమినిసూత్రితం బగుత్రయీబృందంబుతాత్పర్యమున్.

గీ. అటుల ప్రకటించుచు జయించు చఖిలదిశలు
క్రమముగ సుధన్వనృపతి పురంబు సేర
నెదురు సనుదెంచి మ్రొక్కి భూమీశుఁ డపుడు
పూజ నొనరించె విధ్యుక్తముగను భక్తి. 29.

మ. నరనాథార్చితుఁడై బుధుండు ముద మారన్ జేసి దీవించి త
త్పరిషన్మధ్యసువర్ణపీఠి నమరోద్యానం బధిష్ఠించునా
సురభింబోలె నలంకరించి సవిధక్షోణీజరాజత్పిక
స్వర మాలించి వచించె భూభుజుని దద్వ్యాజంబునన్ ధీరతన్. 30.

క. శ్రుతిమాపకరుతి మలినా
కృతి నీచైర్గతియు నైనయుక్కాకవిపం
తతిసంగతి నీ కోపర
భృతము కలుగ దేని ఖ్యాతి కిరవౌ దనినన్. 31.

క. సాభిప్రాయం బగుద్విజ
నాభాషణ మాలకించి యంఘ్రితలస్పృ
ష్టాభీలభుజగములవలె
క్షోభించిరి కినుక నచటిసుగతమతస్థుల్. 32.

గీ. బుద్ధసిద్ధాంతధాత్రీజములను యుక్తి
పరశువునఁ దున్మి తూటాడి భట్టపదుఁడు
ప్రోగుసేసినతద్గ్రంథరూపకేంధ
నముల రవులించె గ్రోధాగ్ని నాల్గుకడల. 33.

క. రోషారుణవదికలితను
లౌషదభిజ్ఞాననముల నానృపుసభ ప్రి

త్ర్యాపాతపత్రామనలిన
భూషితసరసీప్రకారమున నలరారెన్. 34.

మ. వాం రాక్షేప మెలర్ప నొండొరుల గెల్వం బూనువాదోపవా
దారావంబు రసాతలం బవియఁ జేయన్ సాగె; నాధీరుఁ డే
పారన్ గూర్చె నధోగతిన్ క్షణములో నాజైనగోత్రాళికిన్
సారామేయకఠోరతర్కములఁ బక్షచ్ఛేదమున్ జేయుచున్. 35.

ఉ. విజ్ఞుఁడు భట్టపాదుఁ డరిబృందము దాల్చు ననన్యసాధ్యస
ర్వజ్ఞపదంబు నోర్వని తెఱంగున వారిని బొమ్మలట్టు ల
ప్రాజ్ఞులభాతి మానపరిరబ్ధులఁ జేసి, నరేంద్రు డాసి, స్వ
ప్రజ్ఞఁ బ్రశంససేసె శ్రుతివాఙ్మహిమంబు సుబోధ మానలుల్. 36.

ఆ. అపుడు రాజు పలికె నాకుమారిలుని వి
ద్యావశంబు గద జయాజయంబు?
లీయహార్యశృంగ మెక్కి వేదమహత్త్వ
మెఱుకపడఁగఁ బుడమి నుఱుకఁగలవె? 37.

ఉ. 'వేదము బ్రహ్మరూప మని వేదము సర్వచరాచరంబు ను
త్పాదన సేయుఁ బ్రోచును యథార్థ' మటంచు వచింతు తత్త్రయీ
మేదురశక్తి నీవు పుడమిన్ బడి చావక నోవ కున్న నీ
పాదము లాశ్రయించెద భవద్గురుభావము నమ్మి యుండెదన్. 38.

వ. అని ధీరముగాఁ బలికె నంత.

చ. అది విని బౌద్ధులొండొరుల యాననముల్ గనుఁగొంచు నుండ భూ
త్రిదశుఁ డకృత్రిమోక్తుల స్మరించుచుఁ దద్గిరిశృంగ మెక్కి స
మ్మదమున బొంగి 'వేదము ప్రమాణము కాన నొకింత హాని నా
కొదవదు వేదమాతృపదయుగ్మమె నాకు శరణ్య' మయ్యెడన్. 40.

శా. ఆలింపుండి సమస్తలోకులు త్రియీ వ్యాహారముల్ శాశ్వతం,
బాలోచింపఁగ ద్వైత మాశ్రితచయార్థాధీనమై వెల్గుఁ, ద
ల్లీలాకల్పితలోకసంచయుఁడు నాహ్యాద్వైతుఁడై యుండి యీ
శైలాగ్రిచ్యుతు నన్నుఁ బ్రోవఁగ నుపేక్షం జేయఁ డే నమ్మితిన్'. 41

మ. అని యుచ్చైర్నినదంబునన్ నిగమమాహాత్మ్యంబు నగ్గించి మొ
త్తని పూసెజ్జను వ్రాలుచందమున గోత్రిన్ వ్రాలె నాకాశచుం
బనచుంచుక్షితిభృన్మహోన్నతశిరోభాగంబునం దుండి 'జే'
యనుచున్ నిర్భరధైర్యమూని జనహాహాకారముల్ మీఱఁగన్.

క. దౌహిత్రివితీర్ణ శ్రీ
యోహానిచ్యుతసురాలయు యయాతిఁగ సం
దేహించిరి చూపఱు తుం
గాహార్యశిరోనిపతదనంతామరునిన్. 43.

ఆ. కొండనుండి తూలపిండంబు డంబున
నుఱలు నితఁడె లోకగురుఁ డటంచుఁ
దన్ను నమ్మువారి దైన్యము పోకార్చు
శ్రుతియ యనుచుఁ బలుకఁ జొచ్చె జనము. 44.

శా. జీమూతోద్గత గర్జిత శ్రవణ విశ్లిష్టాత్మకుం జాహిభుక్
స్తోమాకార తదద్భుతక్రియకృతి క్షిత్యుద్గతానేకవి
గ్రామ బ్రాహ్మణవృత్తు నతుతు బుధుల్ దర్శించి పేర్మిన్ శ్రుతి
ప్రామాణ్యమ్ముగ్రహించి మూఱుకొనుచున్ బౌద్ధాళితో నిట్లనున్.

గీ. కంటిరే వేదవాక్యములఁ గలుగు మహిమ
మెఱిఁగితిరె దేవుఁ డున్నట్టు లిప్పుడేని

యనుటయు సమంతభద్రమతానుయాయు
లని రనంగీకృతినిఁ దెల్పు చవనిపతికి. 46.

గీ 'అవనిపాలక! మతనిర్ణయమున కిది ప్ర
మాణ మేటు? లోషధుల మణిమంత్రముల శ
రీరక్ష యా' ననుచు నైంద్రియికవిషయ
మపలపింపఁగ నృపుఁడల్గి యనియెనిట్లు. 47.

శా. ఆకాశోన్నతభూరిభూమిధరశృంగారోహియై వేదవా
చాకారుణ్యబలంబునన్ ధరణిపైఁ జాకుండ వ్రాలంగ, ని
ర్భీకప్రక్రియ నప్రమాణ మనినారే మిమ్మునే శ్రోత్రియ నే
వీరన్ మందులఁ జానకుందురో కదా వీక్షింపఁగాఁ దగ్గదే. 48.

గీ. అని కుమారిలు బలసియున్నట్టిద్విజుల
బౌద్ధపండితమండలిఁ బాఱఁజూచి
వేదమునకును మణ్యౌషధాములకును
గలమహిమభేదములు చూపవలయు నేఁడ. 49.

చ. అడిగెద నొక్కప్రశ్న మిము నందుల కుత్తర మేరు చెప్పలే
కెడయుదు రట్టివారి పడియించెద యంత్రశిలావిఘట్టనన్
బడ నని భూరికుటీభయదఘాలము దోఁప ద్విపక్షవాదులున్
గడగడలాడి పోవఁ బ్రతినన్ సహియించి క్షితీశుఁ డయ్యెడన్. 50.

క. ఏకతమున నొకఘటమునఁ
గాకోదర ముంచి మూఁత గట్టిగ నిడి మీ
రీకడవ నేమి యున్నదొ
వాకొనవలె ననుచుఁ బిడుగపాటుగఁ బలికెన్. 51.

క. ద్విజుఁడున్ సౌగతులున్ భూ
భుజుఁ గని మొల్లిటిప్రభాతమునఁ జెప్పెద మీ

నిజ మని ప్రసన్ను నొనరిచి
నిజవసతుల కరిగి రేవల నెవ్వగ మిగులన్. 52.

మ. పచరించెన్ ద్యుమణిన్ గుణించి తప మాబాడబ్యా మారేయు ప
ద్మచయప్రక్రియఁ గంఠదఘ్నజలమధ్యస్థానులై యంతటన్
వచనీయాంశ మినుండు చెప్పి యపిధానం బొంద నేతెంచె వి
ప్రచయుం బట్టులె వచ్చె జైనతతి కుంభస్థాపితార్ఘ్యజ్ఞమై. 53.

చ. క్షితిపతి సింహకొల్వున వసించి సభన్ నలువంకఁ గాంచి 'చే
రితిరె ద్విపక్షవాదులు నెఱింగితి రే ఘటగుప్తవస్తు' వం
చతిసుతుఁడిమ్ములో నడుగ నాస్తికు లప్డు గణించి జ్యోతిష
ప్రతిభ వచించి రిందు నొకపన్నగ మున్నదియంచు సత్యమున్ 54.

వ. అంత భట్టారకుఁడు సభామధ్యస్థం బగుకుంభంబున కెట్టయెదుట నిలిచి యంజలిబంధ బంధురుండై.

సీ. ఆమ్నాయపేటిక యైనమార్తాండుండు
ప్రానాదరాజ మేప్రభువరునకు
శబ్దశాస్త్రానుశాసకుఁడైన శేషాహి
హారంబట్టుతలిమ మేహాయలు గాని
కఖలాంతరస్థుఁడై యాడించు బొమ్మల
మాడ్కి లోకముల నేమాయలాఁడు
యజ్ఞమ్ములందు హావ్యప్రీతుఁడై స్వర్గ
ఫలమిచ్చు యాయజూకులకు నెవ్వఁ

గీ. డట్టిశ్రీపతి యాదినారాయణుండు
శంఖమును జక్రమును గద శార్ఙ్గధనువు
కరచతుష్టమున కలంకారములుగఁ
గుండలోఁ గుండలీంద్రుపైఁ బండియుండె.

క. అనుటయుఁ దోడిద్విజన్ములు
నని రటుసలె; మింటనుండి 'యది సత్య మటం
చు నొక యశరీరవాణియు
విననయ్యెను సభ్యు లెల్ల విస్మయ మొందన్ 17.

క. నరనాథుం డది విని య
బ్బురపడి తత్సమితిమధ్యమునకు రయముమై
నరుదెంచి కాలుఁ గేలుం
గరము వణఁక ఘటము మూఁతఁ గ్రక్కునఁ దోఁచెన్. 58.

శా. కుంభాచ్ఛాదనమున్ దొలంచుటయు నక్కుంభీనసాంగంబునం
దంభోజాక్షుఁడు, దోశ్చతుష్కమునఁ జక్రాద్యాయుధంబుల్ వెలుం
గం భాషాపతి నాభిపద్మమున వెల్గన్ లక్ష్మి కాళ్లొత్త నీ
లాంభోదమ్మటు లెస్స పండికొనినట్లై మాయమయ్యెన్ వెసన్.

సీ. పృథివీశ్వరుం డశరీరవాక్కుఁ గుం
భాచ్ఛాదన మ్మూడ్చి యరసె లోన
నరయ వాసవునకు నమృతము శ్లాఘుట
మందుఁ జూపట్టెఁ గంజాక్షుమూర్తి
న్యస్తాన్యవస్తుసందర్శనమ్మున ధరా
పతి సంశయము వాసి శ్రుతిని నమ్మె
శ్రుతివినిందకులు దుర్మృతికి సిద్ధులు గండ
టంచు ఘోరముగ రాజాజ్ఞ పొడమె
గీ. నాతుషారాద్రి యాసేతు వవనిఁ గల త్ర
యీవిరుద్ధుల నాబాలవృద్ధకముగ
సంహరింపనిభృత్యుండు చచ్చువాఁ డ
టంచు నతిభీకరముగ శాసించె నృపతి. 60.

ఆ. తుఱింతు రిష్టునేని దోష మించుక సేయు
నంతమాత్రమున మహాత్ము లలిగి
చంపలేరె తొల్లి జామదగ్న్యుఁడు పాశి
తప్పె ననుచుఁ గన్నతల్లిఁ దానె. 61.

క. స్కందానుచరుం డగునృప
చందిరుచేఁ బడిరి ధర్మశత్రులు జైనుల్
గ్రందుగఁ; దత్త్వాలంబా
ప్తిం దనరెడుయోగిచేత విఘ్నములగలెఁ. 62.

సీ. శ్రుతి ప్రమాణమ్ముగా మతిఁ దలంచెద మంచు
విలపించి మ్రొక్కువారలను దక్క
శ్రౌతకృత్యముల దూఱ మిఁకెన్న డంచుఁ గం
పిలి యడంగలార్చువారలను దక్కఁ
జీనాది దేశముల్ చెదరిపోయి మతంబుఁ
దొలఁగక బ్రతుకువారలను దక్కఁ
నవమానమున నాత్మహత్య గొగ్గి శరీర
ముల విసర్జించువారలను దక్క

గీ. నెల్లెడ నసించు నాస్తిక బృందములను
వెదకి వెదకి వధించిరి విపులయంత్ర
శిలలఁ గదియించి నృపునాజ్ఞఁ దల ధరించి
కలికమునకేని లేకుండుకరణి భటులు. 63.

ఉ. కాలగతిన్ దమం బడఁగఁ గాంతితతిన్ రవియట్లు జైను ల
న్యోళి నశింప వేదపదవిన్ బ్రసరింపఁగఁ జేసె విప్రుఁ, డా
లీల మృగేంద్రుఁ డొంచుఁ గబళించె రిపుద్విపకోటిఁ గావునన్
గ్రాలె నిరంతరాయగతిగా శ్రుతిశాఖలు గ్రిమ్మ నద్రిశల్. 64.

కుమారిలునిపశ్చాత్తాపము.

మ. అవమానంబున కోర్వ కాత్మవధకృత్యాయత్తు లౌ వారిలో
మిపుడున్ ముఖ్యుఁడవుగాఁ గుమారిలునకున్ బెంపార బౌద్ధాగమం
బు వినేయుం డని నేర్పినట్టిగురుఁడున్ ముంద్రై నశింపం, దదీ
యవినాశంబున కేన హేతు వని నిత్యం బొద్విజుం డార్తుఁడై. 65.

ఉ. వంచన మేన చేసి చదువన్ దొరఁకొంటిని గాక మాయ యొ
క్కించుకయున్ గురుం డెఱుఁగునే జయకాంక్ష యుసీ నయానయం
బెంచఁగనీయ దొజ్జ వధియించినపాపము వాయు నిష్కృతిన్
గాంచనె? యెట్టిదుష్క్రియ నొనర్చితి? నాజయ మేల? కాల్పనే 66

మ. అని మీమాంసకుఁ డా కుమారిలుఁడు ప్రాయశ్చిత్తమున్ గోరి స
జ్జనసంఘంబుల డాయ, వారు "జయదీక్షన్ గొన్న తేజస్వి నం
టునె పాపంబు? గురున్ వధింప నఘమున్ బుణ్యంబు సామాన్యులన్
దునుమన్ గల్గునె? యేటి కింత కలఁగన్ దోషజ్ఞ! యూలింపుమా. 67.

శా. తేజశ్శాలికిఁ బ్రత్యవాయ మనుసంధింపంగ రా దంచు ని
ర్వ్యాజస్ఫూర్తి స్మృతుల్ వచించును; వ్యదారంభంబు వేదాధ్వర
తేజాగ్రన్మహిమాఢ్య మౌ, నఘము రాగద్వేషమూలంబు నీ
వాజిన్ రాజభటుండవోలె నిగమజ్ఞా! నిత్యశుద్ధుండవే. 68

శా. ఐనం గాని యుధిష్ఠిరుండు తనతౌతాప్రిచారముం బూని యే
నానావైరులఁ ద్రుంచి, యందు గురులన్ బంధూత్కరం బెంచి శో
కానంత్యమ్మునఁ గ్రాఁగి దానికయి ప్రాయశ్చిత్తముం బూనుచుం
దానన్ దృప్తికి నీ వొనర్పు తపమున్ ద్యాగంబు యాగంబులున్ 69.

క. అన స్వస్థచిత్తుఁడై య
య్యనఘుఁడు సర్వస్వ మపుడ యాచకుల కొసం

గను గేహక్షేత్రము లి
చ్చెను భూసురతతికి దండసిలఁ బాపంబుల్. 70.

ఉ. యాగములం దొనర్చిన సహస్రగుణం బగుటన్ బ్రయాగ మా
యాగము మాని యున్నను బ్రయాగము యాగఫలంబు లిచ్చునం
చాగమ ముంట నాతఁడు ప్రయాగకు నేఁగి వసించి యెన్నియో
యాగములన్ బొనర్చి చరితార్థతఁ గాంచినవాఁడు సత్తమా. 71.

ఉ. కర్మరుఁడై యఘోరకలికాలమహోఘము లొత్తగిల్లి పో
దుర్మతమర్మహాలం డఘు శ్రుతుల్ స్మృతులున్ విరులట్ల విచ్చి గం
ధోర్ముల సర్వలోకముల నూఁపఁగఁ జూచుచు నీప్రయాగనే
శర్మమునన్ వసించు శ్రుతిజాగరజై మినిశాస్త్రవర్మమై. 72.

వ. అని కుమారిలభట్టచరితంబు వృద్ధవిప్రుండు దెలుపుచుండ నూఁకొ
నుచు మార్గాయాసంబు గణింపక కతిపయప్రయాణంబుల
సశిష్యుఁడై చని చని. 73.

శంకరుఁడు ప్రయాగ కేఁగి కుమారిలుని దర్శించుట.

గీ. ఔపనిషదరహోవేత్త యఖిలకుమత
భేత్త యతిమాళి సాధితవేదకర్మ
జాలుని గుమారిలుని వాదలీల విజితుఁ
జేయువేడ్కఁ బ్రయాగమ్ముఁ జేరి యంత. 74.

చ. అవహితభక్తి మున్కు లిడునట్టి నరాళి మెయిన్ సితాసిత
చ్ఛవిగ నొనర్చుపొంటెఁ గృతసంగకళిందతనూజ యైనజా
హ్నవి నఘహంత్రి భవ్యపురుషార్థపథం బగుదాస భిక్షుహా
ర్థివుఁడు ప్రయాగమధ్యగతఁ బ్రేమ కడల్కొనఁ జేరె నొయ్యనన్.

సీ. భాగీరథీఝురీపరిరుద్ధవేగమై
కాళింది యెచ్చోట జాలువాఱు
నమలరుక్సంప్రదాయము నేర్వ నెందేని
నంచలు జలము సేవించుచుండు
శర్వరీసహవాససౌఖ్యార్థులై చక్ర
యుగము లెచ్చటినీట నోలసి యుండు
నాచంద్రతారకం బమరాకృతుల సుఖ,
యింతు రెచ్చో మున్క లిడినవారు
గీ. గ్రాలునంతఃప్రవాహ సరస్వతి యెట
యమున యై గంగయు నయి సితాసితముగ
నట్టివేణీత్రితయసంగమాంబులందు
మునిఁగి శంకరగురుఁ డిట్లు వినుతిసేసె. 76.

గీ. సిద్ధనది! శంకరజటోపరుద్ధ వగుటఁ
గ్రుద్ధ వయ్యెఁ దన్నిభులఁ బెక్కుర సృజింతు
బద్ధఁ జేయరె జటల నవ్వారలు జడ
బుద్ధు లెఱుఁగంగలారె రాఁబోవుదాని. 77.

ఉ. అంబరొ సత్పథానుసరణాతికుతూహల వయ్యెఁ దాల్తు హే
యం బగుసస్థులక్ సతత మక్కట యే మనుకొంటిఁ గాఁ స
త్యంబు నెఱింగితిక్ ద్వదమలాంబునిమజ్జను లైనసజ్జనౌ
ఘంబు నలంకరించుటకుఁ గా నివి యెల్ల గ్రహింతు వాస్థమై. 78.

గీ. ఔర స్వాపానుషంగజాడ్యము గనుజ
నాళి స్వాపానుషంగజాడ్యాపగతుల
సల్పుదువు విషయవిరక్తజనుల ఘూర్త
మౌళుల నొనర్తు విది యేమి మార్గమమ్మ. 79.

సీ. అనుచుఁ ద్రివేణిని వినుతించుచుఁ గటీర
మున శాటికను జుట్టుకొని కరయుగి
వైణవదండ మొప్పార మెత్తికొని పట్టి
యఘమర్షణావగాహం బొనర్చి
చరితార్థుఁ డయ్యెఁ దా జనసంగ్రహార్థమ్ము
సచ్ఛాత్రుఁడై యందు స్నానమాడు
నత్తఱిఁ దనుగర్భమునందుఁ బొలిచి కని
పెంచఁ బొల్పొందుసవిత్రిఁ దలఁచి
గీ. తీర్చికొని యనుష్ఠాన మత్తరమునఁ ద
మాలసుచ్ఛాయఁ గల్హారపాళిశీత
వాతసేవల విశ్రాంతి వడయువాఁడు
శంకరుం డొక్కజనవార్త సరగ వినియె. 80.

—: తుషాగ్నిప్రవిష్టుఁ డగుకుమారిలుని శంకరుండు దర్శించుట :—

గీ. సజ్జనుల కేడ్గడయునై యచలము నుండి
యిలఁ బడి శ్రుతిప్రమాణత నెవఁడు చాటె
నెవ్వనిప్రసాదమున వేల్పు లెప్పటట్ల
యజ్ఞభాగంబు లొందుభాగ్యంబు గనిరొ. 81.

క. అట్టిఘనుండు కుమారిల
భట్టపదుం డకట స్వగురువధపాప మడఁగ
జొట్టుముకచిచ్చులోఁ బడె
నట్టి త్రయీహృదయవిజ్ఞుఁ డాస్తికుఁ డగుటన్. 82.

గీ. ఆతఁ డొకపాటివాఁడె యధీతవేద
జుష్టమంత్రుండు పూరితదుష్టతంత్రుఁ
డఖిలతంత్రస్వతంత్రుండు నిఖిలభువన
మండలీభ్రాంతకీర్తియంత్రుండు దలఁప. 83.

క. అనువార్తవిని యతియుఁ జ
య్యనఁ జని తుషరాశిసంస్థునాభట్టపదున్
గనియెఁ బ్రభాకరముఖశి
ష్యనివహ మశ్రువులు గాఱ నర్చ లొనర్పన్. 84.

క. పొగయుచు రవులుతుషాగ్నుల
సెగల నశేషముగ మేను చిటచిటఁ గాలన్
వగలేని మొగము బాష్పో
పగతాబ్జమనన్ వెలుంగు వానిం డాసెన్. 85.

సీ. చరమదేహము భస్మసాత్కృత మయి లోని
యస్థులు కాలి మ్రగ్గుచు రాల
దహ్రవగర్భనాడీకాంత్రములు చిమ్మనఁగ్రొవ్వు
లన నిప్పుఁ జుంయి చుం యనుచు నార్పఁ
బలలపిండమ్ములు భస్మమ్ము గాక చి
ట్టెము గట్టి కమరుగంధములు గ్రక్కఁ
గాలఁగా మిగిలి సూక్ష్మముగఁ గాలెడుచర్మ
మున బుస్సు మని కప్పపొక్కు లెగయ
గీ. మలయునిష్కళదహనధూమ్యాప్రతాన
మునఁ గనుంగవ గనరాక కనుచునున్న
భట్టపాదుని గని యార్తి పట్టఁజాల
కంతటివిరాగి శంకరుం డశ్రు లొడ్చె. 86.

ఉ. అంతలపొంతలన్ గనఁగ సౌనఘున్ యతిచంద్రునిన్ గటా
క్షాంతనిరీక్షఁ గాంచి జ్వలదగ్నిసభుండు జితాంగ నేసవా
క్సంతతిరక్షకుం డగు ద్విజన్మఁ డదృష్టచరున్ విబుద్ధవృ
త్తాంతుని గంటి నేఁ డనుచు నానినమోదము చెప్ప సాధ్యమే. 85.

గీ. అవశుద్ధై పడియుండియు నాద్విజుండు
శిష్యతతిచేత భక్తిఁ బూజింపఁ జేసె
భిక్షుఁగొని శంకరుండును దృప్తిఁ దనర్చి
స్వకృత మగుబ్రహ్మసూత్రభాష్యంబు సూపె. 87.

క. అది యట్టిద సుజనదయా
స్పద మయిననె నిఖిల మగునిబంధనము యశః
పద మొందుఁ; గానియెడ నం
దదుకుబ్రతుకు గాంచవచ్చు నణఁగక వచ్చున్. 87.

వ. అంత భట్టపాదుండా గ్రంథమును గన్నులఁ గాంచి యుస్సురని వగచి యిట్లను.

గీ. ఇట్టి దీక్షను నేను గ్రహింపనేని
భాష్యములకు రచింపనే వార్తికములఁ
గనఁగఁ దత్ప్రథమాధ్యాయమున కెసిమిది
వేలవార్తికముల యవలీలఁ గావో. 88.

ఉ. సారవిచారసంసరణసాగరమగ్నులకున్ భవాద్భశో
దారచరిత్రులైనమహితాత్ములసంగతి యొక్కటే సుమీ
పారము సేరఁగాఁ దగునుపాయము గా; కితరంబు లేతదు
త్తారణశక్తి నుత్తవె కదా వగ దా సలుపక జగద్గురూ! 89.

క. చిరముగ భగవంతుని నిను
నరయం గోరెదను నేఁటి కది తీఱెను సం
సరణార్ణవగు లగు నరులకుఁ
గర మభిమతసిద్ధి యిష్టగతిఁ గలుగునొకో. 90.

గీ. కాల మిష్టుఁ తోడ నొకవేళఁ గలుపుఁ
గలుపు నొకపు డరిష్టు లౌఖులులతోడ
నటుల కలిపియు నెడఁ బాపు నంతలోన
కష్టసుఖము లు కాలంబుకై వసములు. 93.

వ. అనవుడు యతిపుంగవుఁడు 'ఓ బుధేంద్రా! భవదీయచరితం బాతయు వింటి. భావత్కం బగుతంత్రివార్తికం బధ్యయనించితి. నీవు మహీతలంబునం దవతరింపవేని జైమినిప్రయాసంబు వ్యర్థంబుగాదె. హవ్యంబుల దేవతలకు గవ్యంబులఁ బితరులను దనిపితివి. వైదికమతైకకంటకు లగుజైనాదిపాషండజనంబుల నుచ్చాటనం బొనర్చి జన్మం బర్థవంతము గావించికొంటి వైన నేమి నేఁ 'డాజైనగురుద్రోహము నీశ్వరనిరాస మనునిజదోషద్వయపరిహారకంబుగఁ దుషాగ్నిఁ జొచ్చి తని కింవదంతి యీక్షేత్రంబునందు నాలించితి. తుషాగ్నిప్రవేశ హేతు వదియ యగునే వినవలతు ననుటయుఁ గుమారిలుఁ డి ట్లనె 94.

సీ. చదివినాఁడను వేదశాస్త్రమ్ము లామూల
మాచూడముగ బాల్యమంద శ్రద్ధ
విరచించినాఁడ నిస్ఫురదీక్షఁ దంత్రవా
ర్తికముఖ్యకృతులు తృప్తిప్రియముగ
గెలిచినాఁడ సభాస్థలుల వితండావాదు
లగుజైనకోటి పెంపఱఁ గడంకఁ
బొందినాఁడ ననర్ఘములు భోగములు, యాగ
ముల దైవతర్పణంబు దొలఁచికొంటి

గీ. వేదమార్గరిరక్షమై వెదకి వెదకి
నాస్తికులఁ బలుమాఱు వేఁటాడినాఁడ

వార్ధకమునఁ బ్రయాగకు వచ్చినాఁడ
వ్రతి నౌచుఁ గాల మిటఁ బుచ్చినై చినాఁడ. 95.

సీ. అక్షర మ్మొక్కటి యైనఁ జెప్పినవాఁడు
గురుఁ డనుమాట నే నెఱుఁగనొక్కొ
స్వమతాభిమానవిశ్వాసంబులు గురుండు
తనుఁ దా నశింప నాతప్ప దెట్లు
గురుఁడు సౌధమునుండి కూలఁద్రోయింప జీ
వించియు నింత నిందించితినొకొ
నృపతి యారీతిపన్నిదము వెట్టెను గదా
నేన యోడినఁ జాక నిలుతునొక్కొ
గీ. కుమతవిధ్వంసనము సేయుకొఱకుఁ గెలుతుఁ
గాని గురుఁ జంప నూహించి కాదుగద! య
జాకృపాణీయముగ నది సంఘటిల్లెఁ
జేసికొంటి దానికిని బాచితము దేవ! 96.

శా. నామూలంబున దేశికుండు బలవంతాపైనచా వొందినాఁ
డేమో యంచు ననేకనిష్కృతులు మున్నే చేసికొన్నాఁడఁ జు
మ్మీ మీమాంసకుఁ డౌట 'శత్రుజయమం దేదోషముల్ లే'దటం
చామోదించిరి ధర్మవేత్త లలనాఁ డాసేతుశీతాద్రిలోన్. 97.

మ. 'భృగుపాతంబొ తుషాగ్నిలోఁ బడుటొ వారిన్ జొచ్చుటో సల్పఁగా
నగుఁ గాయం బసమర్థమౌనెడలఁ గర్మాసక్తుఁ డౌవేత్త, పు
ణ్యాగతుల్ హస్తగతంబు లావ్రతి' కటం చామ్నాయముల్ దెల్పవో
పగవా రట్టుల కింవదంతులను నాపై మోపినా రేమొకో. 98.

క. వాని నటుపెట్టు పాండవు
లానాఁడు తనూనిరీహు లగుచు మహాప్ర

స్థానమ్ము సలుపరే యటు
తేనున్ జొచ్చితిఁ దుషాగ్ని నిది వ్రతము సుమీ. 100.

చ. శ్రుతియ స్వతఃప్రమాణ మనుచున్ బ్రకటింపఁగఁ బూని వేనిసం
గతి మెడఁబాయ నించుకసుఖంబును గూడఁ బ్రపంచ మీయ న
ర్హతఁ గనఁ జాలదో-యొకపు డైనను నాశ్రుతిలోకసిద్ధు నం
చితపరమార్థు నీశు నిరసించితిఁ గాని యొనర్ప నిహ్నుతిన్. 101.

గీ. నీవు భాష్యమ్ము సేఁత వింటిస ముదంబు
గంటి నద్దానికిని వార్తికంబు గూర్చి
యశము గనువాఁడ ననుకుతూహలము గందు
నేమి లాభ మామాట నే నిపుడు నుడువ. 102.

ఉ. ఆతతసారతత్త్వమున నార్యజనంబులఁ బ్రోవఁ,గావ న
ద్వైతము, భూమిఁ బుట్టుభగవంతుఁడ వంచు నెఱుంగుదున్ యతి
వ్రాతలలామ! మున్న కనుపట్టి ననున్ జరితార్థుఁ జేయుచో
నీతఱి నిట్టిదీక్ష వహియింప నిఁ కేమన లాభ మే మగున్. 103.

గీ. అకట దీక్ష వహించి తుషాగ్నిఁ బడితిఁ
గాన శాబరభాష్యమ్ముకరణి నీదు
భాష్యమునకును వార్తికపాఠమును ర
చించి యశమొందుభాగ్యము చెందనైతి. 104.

క. అన నీషద్వికసితముఖ
వనరుహుఁ డయి గురుఁడు పలుకు వైదికధర్మా
యనకంటకు లగుజైనులఁ
దునుమఁగఁ బొడమినయుమాసుతుండవు గావే. 105.

గీ. ఆజనుఃపావనుఁడవు నీ కఘము గలదె
యేటి కీదుష్కరవ్రతం బిదె కమండ
లూదకము చల్లి బ్రతికింతు నొనర భాష్య
వార్త్తికమ్ము రచింపు ధీవర్య లేచి. 106

ఆ. అనెడుబుధవతంసు నాత్మవిద్వర్యుని
శమధనైకధుర్యు శంకరార్యుఁ
బ్రశ్రియంబు దోఁపఁ బలికె విద్యాధనుం
డైనభట్టపాదుఁ డనువుమీఱ. 107.

సీ. నీపల్కు లెస్స గానీ, శుద్ధమైనను
లోకవిరుద్ధముల్ సోఁకఁజాల
నాజానకుటిలులందైన వింటనుబోలె
గుణమె మహాత్ములు గూర్చుచుంద్రు
చిరమృతునేని సంజీవింపఁజేయుదు
పటుదయోర్మిళ దృష్టిపాతముునన
వ్రత మూఁగమోక్ష మారంభించి త్యజియించి
బుధజనాదర మెట్లు పొందువాఁడఁ
గీ. దెలియనె భవన్మహత్త్వ? ప్రాణులను ద్రుంచి
మరల సృజియించునీకు నన్మనుపు టెంత?
యైన విడఁజాల నీపూనినట్టివ్రతముఁ
డారకబ్రహ్మ మెఱిగించి ధన్యుఁ జేయు. 108.

గీ జగతి నద్వైతపథము విస్తరిలఁజేయఁ
దలఁచితేని జయింపు విద్వత్పురార్ధ్యు
మండనాఖ్యు దిగంతసంభ్రాంతయశుని;
నతఁడు జితుఁ డైన జగ మెల్ల హస్తగతమ. 109.

ఉ. ఆతఁడు కర్మయోగమును వ్యాప్త మొనర్చుచు విశ్వరూపవి
ఖ్యాతిని మించె ధాత్రిని; మహాగృహియై శ్రుతికర్మసక్తుఁడై
ప్రీతిఁ బ్రవృత్తిశాస్త్రపదవిన్ బడి, రోయు నివృత్తిశాస్త్రి మ
న్నా! తగుయుక్తి వశ్యుని నొనర్చుకొనన్ గడముట్టుఁ గోరుకుల్.

వ. "ఉంబేకుం" డనుపేర లోకంబునం బరఁగు నవ్విశ్వరూపుఁడు నాశి
ష్యుండై సకలవిద్యామండనుండు కావుటంజేసి మండనుం డనుబిరు
దనామంబున వ్యవహృతుం డగుచు నుండు, నుభయభారతి యను
పేర నొప్పునయ్యాయజూకశిరోమణిజాయ "యుంబ" యనునా
మంబున బంధుజనులచేఁ బిలువంబడుచుండు. నాయమ దుర్వా
సోముని శాపంబున మానవియై జనించినభారతియ యని ప్రసిద్ధి
గల దది యట్టుండనిమ్ము. 111.

క. ఆవిబుధుఁ డఖిలశాస్త్రిక
లావళి నను మించు శిష్యులందుఁ బ్రియతముం
డీ వతనిసతిని సాక్ష్యవి
ధావర్తినిఁ జేసి గెలు మతని వాదమునన్. 112.

గీ. అతనిచేఁ దావకీనభాష్యమున వార్తి
కముల గ్రథియింపఁజేయుమీ యమలచరిత!
సమయమునకు విశ్వేశుచందమున వత్తు
తారకముఁ దెల్పి నను ధన్యతముని సల్పు. 113.

మ. నిలు నిర్వ్యాజకృపా! ముహూర్త మిచటన్, నీరూపు యోగీంద్రహృ
న్నలినాంభోరుహభాగ్యమున్ గనుచుఁ బ్రాణంబుల్ విడంజూతునం
చలఘుజ్ఞాని యతం డనన్ గురుఁడు శుద్ధాద్వైత మంతర్బహి
ర్గళితాజ్ఞానము బ్రహ్మమున్ దెలిపె నిష్ఖండామలజ్ఞానమున్. 114.

క. శంకరుఁ డిటు నిఖిలజగ
చ్ఛంకరుఁ డుపదేశ మిచ్చి తా రాజధని
శ్శంకగతి మండనాఖ్యుని
భంకరభవనమున కేఁగ వాంఛించుటయున్ 115.

ఉ. మాటలు మాని శాంతిధనమాన్యుఁడు భట్టపదుండు హృత్తమః
పాటన మామమత్వవినివారక మద్వయతత్త్వ మూని జం
జాటము లెల్ల నూడిచి ప్రసన్నము వైష్ణవధామ మొందె న
ప్పాటన శంకరార్యనికృపారస మందుటఁ జూచుచుండఁగన్. 116.

—: శంకరుఁడు మండను దర్శింప నరుగుట :—

గీ. అపుడు భగవంతుఁ డగుశంకరార్యుఁడు సహ
శిష్యుఁడై యోగశక్తిఁ జెచ్చెర నభోయ
నమునఁ జని చేరుకొనియె మండనబుధేంద్రు
కాఁపురం బైనమాహిష్మతీపురంబు. 117.

గీ. రత్నకిమ్మీరవరణ మబ్రమ్ము గూర్ప
సరసి మాహిష్మతీపురాభ్యర్ణవనిని
నంబరవతీర్ణుఁ డయ్యె నారాయణావ
తారుఁ డగుభార్గవునిశేవ దండి యతఁడు 118.

చ. వికసితవారిజాతవనవీథుల నాటల నాడు, చూర్మిగో
దకకణశీకరంబులను దానములాడుచుఁ, దీరసాలమా
లిక లెగఁబ్రాఁకి యంత గదలించుచు నయ్యెడ నర్మదానిలా
ర్భకములు భాష్యకారుశ్రమభార మడంచి భజించెఁ జల్లఁగన్. 119.

ఉ. ఆహరితామలోపవనమందుఁ గృతాహ్నికుఁ డౌచు స్వస్తికా
రోహణశాలియై ఖరకరుండు వెలుంగ గురుండు శిష్యసం

దోహము గొల్చి రా బుధవిధుం డగుమండనుఁ గాంచు వేడ్కఁ ద
ద్గేహము సేరుచుణ్ గనెఁ దదీయభుజిష్యలఁ దోవ నొక్కెడన్.

గీ. నీరు దే నేఁగు నప్పరిచారికులను
మండనసుధీందుగృహ మెట నుండు ననుచు
నడుగ నద్భుతశంకరు నతనిఁ గాంచి
ముదితలై యిట్లు పల్కి రమ్ముదిత లాఁగి. 121.

సీ. మహి వేదము స్వతఃప్రమాణమా పరతఃప్ర
మాణమా యనెడుసంభాషణముల
ఫలము నిచ్చునది నిచ్చలు కర్మమా పర
మాత్మమా యనెడు వ్యాహారములను
జగము శాశ్వతమా యశాశ్వతమా యన్చుఁ
గెరలి వాదించెడుగీఃఫణితుల
యత్యాశ్రమంబా గృహస్థాశ్రమంబా మో
క్షాధాయకం బగు ననెడునుడులఁ

గీ. గీరభామిను లేగృహద్వారబద్ధ
పంజరస్థమ్ములై శాస్త్రపటలి శ్రుతులఁ
జదివి వాదించుకొనుచుండు నదియ మాప్ర
భుండు మండనపండితుం డుండుగృహము. 122.

సీ. ప్రాకారతోరణవ్యాకీర్ణ మయి శిలా
స్తంభశతభ్రాజితంబు నగుచు
గర్భగృహాశ్వరా గారశయ్యాగార
శిల్పనైపుణ్యప్రసిద్ధ మగుచు
సర్వవిద్యాపాఠశాలాప్రపంచసం
భావితతత్పరో భాగ మగుచు

నఖలర్తు ఫల లతాంతాంచిత తరులతా
భ్యర్హితప్రమదావనాఢ్య మగుచు
గీ. విబుధమండనమిశ్రనివేశ మదిగొ
తాళభూజోచ్ఛ్రితంబు విద్యాలయాంక
విలసితంబయి రెండువీధులకు నడుమ
వైజయంతంబు తలఁదన్ని తేజరిల్లు. 123.

క. అందొక పెద్దవితర్దిక
యందుఁ గద్దియ వసించి యావిబుధుఁడు రా
త్రిందివము శిష్యబృందము
లం దనుపు శ్రుతిస్మృతుల్ నేరుపుచున్. 124.

గీ. గృహమునని యుండె నేఁడు పైతృకము నెఱపు
చున్నవాఁ డన్యులను జూడ నొల్లఁ డితరు
లింట గాలిడకుండ బహిష్కవాట
బంధన మొనర్చి నటు లేఁగువాఁడ వనుచు. 125.

మ. పటువాగ్వైఖరి నిట్లు వారనఁ బరివ్రాణ్మౌళి తాఁ బాదుకా
ఘుటికాసిద్ధు లెఱుంగుటన్ దివిఁ జనన్ గోరెన్ మఱిన్, గాని యా
తటిలోఁ నొచ్చెఁ నతండు ధిక్కరణముల్ గావించు నేమో విశం
కటదీక్షన్ బితృకార్యమున్ నెఱప విఘ్నం బౌ దు నన్భీతిచే. 126.

క. కావున ముందుగ నీయం
తేవాసుల నంపి వార్త తెలిపినచో న
న్నావిప్రుం డతిథిగఁ గొని
పోవును దనయింటి కనుచు బుద్ధిఁ దలఁచుచున్. 127.

శంకరశిష్యులకును, మండనశిష్యులకును వాక్కలహము.

ఉ. అచ్చట నొక్కెడన్ నిలిచి యారసి శిష్యుల 'మీర లేఁగి మే
మిచ్చట నున్నవార్త వచియించి బుధేంద్రుఁడు సమ్మతించెనే
నిచ్చటి కేఁగుదెం, డవుల నేఁగుద మప్పుడ' యంచుఁ బంపఁగన్
జెచ్చెర వారు మండనమనీషి గృహావరణంబు సేరుచున్. 128.

ఉ. కాంచ బహిష్కవాట మతిగాఢపినద్ధమహార్గళంబు గా
వించుట గోచరించుటయుఁ బెద్దయెలుంగునఁ బిల్చి పిల్చి 'యో'
యం చొకమాఱు పల్కినటుఁ లైన నొకింత దిటంబునన్ బ్రతీ
క్షించుచు నుండ మండనుభుజిష్యులు తీసిరి తత్కవాటమున్. 129.

ఆ. తీయునంత లోని కాయతుల్ బిఱబిఱఁ
జొచ్చి వచ్చుచుండఁ జూచి మీర
లెవ్వ రేమిపనికి నేఁతెంతు రివ్వేళ
ననఁగ వారు మండనార్థ మనుచు. 130.

చ. మొదలిటికక్ష్య దాఁటి చనఁ బో నట మండనశిష్యు లొక్కమై
యెదురుగ నేఁగుదెంచి జనియించెడికోపము డిగ్గఁద్రావున
మ్మదులఁ జలాచలావయవమండలిఁ గోకనదోపమాక్షులన్
మదము బయల్పడన్ దదయసం బరికట్టిరి క్రోఁతిమూఁక నాన్.131

క. ముండితశిరములు కావులు
దండములు కమండలువులుఁ దాల్చుపరివ్రా
ణ్మండలము గువ్వకరిగొని
దుండగమునఁ బెలుచ నవ్వఁదొడఁగిరి వారల్. 132.

ఆ. నవ్వి పుర్వ్వఁదిట్టి చివ్వకుఁ జేసాచు
మండనాంతవాసిమండలికిని

శంకరార్యశిష్యసమితికిఁ గొంశోక
నడచెఁ దీవ్రజల్పనములపాఁడు. 133.

వ. అట్లు పెద్దరొదగాఁ గొంతడవు వారు నడచినపిదప సద్దుమాన్పి మండనశిష్యుం డొకఁడును శంకరశిష్యుం డొకండును నిట్లు వివదింపఁజొచ్చిరి. 134.

సీ. ఎటనుండిరా ముండి యిహీహీ యనుచుఁ బల్క,
నాగశం బే ముండి ననుచుఁ బల్కె
నది కాదు నీత్రోవ నడిగితి నాఁగ, నా
తెరువు నీతో నేమి తెల్పె ననియె
నీయంబ ముండ పోరా యన్నది యనంగ,
నడుగు ని న్న ట్లంట న్యాయ్య మనియె
బీతమా సుర యిట్లు ప్రేలుచుంటివి నాఁగఁ,
బీత మె ట్లగు సుర శ్వేత మనియె
గీ. నెఱుఁగుదువె దాని రంగు నా, నేను రంగు
నీవు తద్రుచి నెఱుఁగుదు మింత నిజమ
టంచు వక్రోక్తులను నిరసించుకొనుచుఁ
గినుక వెలిఁబుచ్చుకొనిరి ప్రాకృతులపగిది 135.

గీ. అలకళంజసంగ్రసనమదాత్మజాత
దుష్ప్రలాపంబు లిట్టులే తోఁచు ననఁగ
సత్యమాడితివి త్వదాత్మజాతుఁడు పిత
వలెఁ గళంజాశియై ప్రేలువాఁడ యనియె. 136.

గీ. ఖరముమోయఁగఁ జాలనికంథ నకట
మోయఁగలనీకు దుర్వహమ్ములుగ దోఁచె

నా శిఖాయజ్ఞసూత్రంబు లధమచరిత
బ్రహ్మబంధుఁడ నినుఁగన్నఁ బాతకమురి. 137.

క. నీజనకుఁజేని మోనం
గాఁజాలనిబొంత మోవఁగలిగితిఁ గానీ
యోజాల్మ! సిగయు జన్నిద
మోజఁ జ్ఞతిభార మగుట నుత్సర్జింతుజ్. 138.

క. ఆలికి నన్నము పెట్టం
గా లావటి శిష్యపుస్తకభరము మోవం
జాలినబ్రహ్మవినిష్ఠతఁ
దాలుచునీగుట్టు ప్రకటితః బయ్యెఁగదే. 139.

క. గురుజనశుశ్రూషఁ దొఱఁగి
తరుణీశుశ్రూషయందుఁ దర్పరమతివై
వరలెడుకర్మవినిష్ఠతఁ
దరలెడునీనడత ప్రకటితం బయ్యె బళే. 140.

క. భామలకడుపునఁ బుట్టియు
భామలు పెంపంగఁ బెరిఁగి బాలిశ నేఁ డా
భామల దూఱుచు నుంటి వి
దేమి కృతఘ్నత్వ మూని యేలా బ్రతుకజ్. 141.

క. ఎవ్వరినుండి జనించితొ
యెవ్వరిచనుఁబాలఁ గ్రోలి యిటు పెరిఁగితివో
యవ్వేలఁదుల నెఱు గవయుదు
వువ్విలుతుని కేలిఁ బశువుపోలిక మూఢా. 142.

గీ. యత్నపూర్వ మగున్న లకట! యుద్వాసించి
వీరహత్య నొంది తౌర జడుఁడ!
పరమపదము బ్రహ్మ మెఱుఁగఁగాఁ జాలక
యాత్మహత్య గంటి వౌర ఖలుఁడ! 143.

క. చోరునివలె దౌవారిక
వారము వంచన మొనర్చి వచ్చెద విస్సీ
పారాశరులకుఁ గూడిడ
కౌరా యెటు కుడుతు డేగ యట్టుల ఛీఛీ 144.

గీ. కర్మకాలమునందు మూర్ఖాళితోడ
మాదృశులకు వాకొంట ధర్మమ్ము గాదు
తెలివి యతిభంగముగఁ బల్కుఁ దెలిసి నోరి
యతికి భంగ మొనర్చు నా కగునె దోసఁగు? 145.

క. "యతివలన భంగ" మని స
మ్మతిఁ బంచమ్యంతమున సమాస మ్మోదు
ర్మతి' చెప్పుకొనుము కా కటు
యతి భంగింపంగ నీకు నలవియె యెపుడున్. 146.

ఆ. బ్రహ్మ మేడ? నిద్దురాచారరతు లేడ?
నెచటిసన్యసనము లిట్టికలిని
మృష్టభోజనార్థ మిట్టుల యతివేష
ధారివైతి వంచుఁ దలఁపవచ్చు. 146.

ఆ. నాక మేడ? నిద్దురాచారతు లేడ?
నగ్నిహోత్రి మేడ? నకట కలిని
గ్రామ్యధర్మతత్పరతనె కర్మఠరూప
ధారి వైతి వంచుఁ దలఁపవచ్చు. 148.

క. అని గృహి, యతి, శిష్యద్వయ
మనయము కినుపొంది తీవ్ర మగువాదమునన్
తనతనమర్యాదోల్లం
ఘనమునకై రాత్మకర్తృకతఁ గన కుంటన్. 149.

ఉ. కొందఱు లోని కేఁగి తమకున్ యతిరాజికి నైనవాదపుం
దందడిఁ దెల్పఁ గొండొక వితాకయి మండనుఁ డాత్మ నెంచెఁ "గ
ర్మందిని జూడ" నన్నియమంబున నుండఁగ నాగురుండె తా
నందెనటే తురీయ మగునాశ్రమ మే మొనరింతు నియ్యెడన్. 150.

క. గురుఁడు గురువరుఁగ శంకరు
వరియించి తరించె నంచు వార్త వినియు మం
దిరమం దడుగిడుహారా
శరుల నరయ కుంట శిష్టసమ్మత మగునే. 151.

సీ. ప్రబలసిద్ధాంతనిబద్ధ మాపూర్వమీ
మాంసాగమ మ్మప్రమాణ మెట్టు
లెందుఁ బ్రాయశ్చిత్త మే నెఱుంగక సల్పు
కర్మకాండము మానఁగల్గు టెట్లు
సర్వజ్ఞుఁ డస్మదాచార్యుఁ డే మారసి
సంన్యసించెనో యోచఁజాలు టెట్లు
శ్రాద్ధకాలమునఁ బారాశరిభిక్షాప్ర
దాననిషేధవిధాన మెట్లు
గీ. పాయు టెట్టుల గురుసంప్రదాయసరణి
నిష్టమేని యనిష్టమే నేకమతిని
శిష్యుఁ డాచార్యమతమునే స్వీకరింపఁ
దగు నటం డ్రిప్పు డీచేటు తలఁగు టెట్లు. 152.

వ. అని తనమనంబునఁ గొంత సేపు మథనము గావించి భట్టపాదులపాద
ములు నమ్మినవాఁ డగుటంజేసి యాసుధీసింహుఁడు యతివదనవిలో
కననిరాకరణవ్రతంబు తత్క్షణంబ యుత్సర్జించుకొని. 153.

మండనుఁడు శంకరునకు భిక్షావందన మొనర్చుట.

శా. సందేహమ్ములు వాయుదట్టి నిజశిష్యశ్రేణి నీక్షించి 'క
ర్మంబుల్ పూజ్యులు శ్రాద్ధవేళ గృహిధర్మం బీఁగ న్యాయంబె? వా
రిందుర్ రాఁ గని మీరు చూడఁ దగునే యెచ్చోట నున్నా' రటం
చుం దోడ్తోడన మండనుండు సహశిష్యుండై యెదుర్వచ్చి తాన్.

గీ. అర్ఘ్యపాద్యాదికంబుల నర్చ లిచ్చి
తనవినేయులయవినయము క్షమింప
వేడుకొని శంకరార్యుఁ డవ్వేట నుండె
ననుపలుకు వించు హర్షించి యంగవించి. 155.

శా. పౌరుల్ పిన్నలుఁ బెద్దలున్ హితులు సంబంధుల్ నిజాంతేవస
ద్వారంబున్ దను నంటిరాఁ జని పురాంతర్వర్తి దేవాలయ
ద్వారోపాంతవితర్దికాసమతలాధ్యాసీను ధీశ్రీసమా
హారున్ శంకరుఁ జేరి తా సలిపె సాష్టాంగప్రణామంబులన్. 156.

క. ద్విజుఁ డటు 'న కర్మణా న
ప్రజయా' యను శ్రుతిఁ బఠించి వందన మిడఁగా
ఋజుగతి 'నారాయణ' యనుఁ
దిజగద్వంద్యుండు తద్యతిగ్రామణియున్. 157.

ఉ. వందన మావిధిన్ సలిపి పాద్యము నర్ఘ్యము నిచ్చి భిక్ష మా
మందిరమం దొనర్పవలె మత్పితృదేవత లెల్ల నేఁటితో

నం దెద రూర్ధ్వలోకముల నంచును శ్రాద్ధము నేఁడ యంచుఁ గ
ర్మంఁదిలలాము శంకరుని బ్రార్థనసేయ ననుఁ స్మితాస్యుఁడై. 158.

ఆ. అన్నభిక్షుఁ గోరి యరుదేర నోయన్న!
వాదభిక్ష మిడఁగ వలఁతి వేని
క్షణము నందువాఁడఁ; గా దందువా చెప్పు
వచ్చినట్టితోవఁ బట్టి పోదు. 159.

క. ఓడనివానికి నోడిన
వాఁ డంతేవాసి యగుట పన్నిదము సుమీ
నేఁడే వా దింతయు తగ
పోఁడల రావింపు ధర్మమూర్తుల సభకున్. 160.

క. యత్యాశ్రమి వయ్యు వివా
దాత్యాసక్తుండ వగుట యర్హామె యంటె
ముత్యంతపథావనసై
యత్యమె హేతువుగఁ దెలియుమా బుధవర్యా! 161.

చ. జగతిఁ ద్రయీశిరఃపథము జాగృతి నొంద ప్రచారమందు నుం
డఁ గనుట దక్క వాంఛితము నా కెదియున్ గనరాద, నీవు కే
వగలు త దేకదృష్టిని సవంబుల మున్ని, భవాగ్నితాప మా
ర్పఁగఁ దగు మన్మతంబును దిరస్కృతిసేయుదు వట్టె దిట్టవై. 162.

ఆ. అభిభవించి నిన్ను నఖిలవివాదిని
జగతిఁ దన్మతమ్ము చాటువాఁడఁ
గొనుము నా మతమ్ము గొనకున్న విపదింతు
వో 'జతోఽస్మి' యందువో పఠింపు. 163.

గీ. అను యతీంద్రునియర్థయుక్తాభిభాష
ణముల కరుదంది కీర్తిసంతతుఁడు బుధుఁడు
నవపరీభావ మెనసియుఁ బ్రవచియింపఁ
బూనె నిజగౌరవము మనంబునఁ దలంచి. 164.

గీ. అనునె వీఁడు 'జితోఽస్మి' యంచును సహాస్య
వదనములవాఁడె వాదింప వచ్చెఁగాక
వేదసమ్మతమతమును వీడి యెపుడు
మానిపరికల్పితమతంబుఁ బూనఁబోఁడు. 165.

ఉ. 'వచ్చునె యెన్నఁడే నొకవిపశ్చిదపశ్చిముఁ, డౌనె వానితో
నచ్చుగ నాకు వాదకథ' యంచుఁ గుతూహల మొందు నా కిదే
వచ్చె జయోత్సవంబు, మనవాదకథల్ ఫలియించు విద్యలం
దొచ్చెములేని నాశ్రమ; మహో! సుధ యబ్బ నెవండు గాదనున్.

సీ. శమియింపఁజేయుదు యమహంతనేని స్వ
యమ్ముగా నామహిమ మ్మెఱుఁగవొ
కానిమ్ము కలహమ్ము కలహంససత్కళా
భరితయాస్మాకీనభాషణముల
వినవొ దర్శనపాఠజనిత మానాపోధి
వైరిగర్వవనీకుఠారధార
నాసించి తిట్లైల యత్యల్పభిక్షమ్ము
వాదభిక్షమె యిచ్చువాఁడ మెచ్చ
గీ. వాద మన సిద్ధముగ నున్నవాఁడఁ జిరము
గా నభిలషింప వాది యొక్కరుఁడు రాఁడ
యట్టిలోపంబు దీఱంగ నరుగు దెంతు
వింక సందేహ మేల యతీంద్రచంద్ర! 167.

క. కాని యిటఁ బ్రొద్దువాకుని
గానన; గెలుపోటములు తగఁగ దెలిపెడువి
జ్ఞాని లభింపనివాదున
మానఁ దుభయకంఠశోషమాత్రము మిగులున్. 168.

క. వాదముల వాదియును బ్రతి
వాదియుఁ గొందరు విపక్షపక్షము, గానన్
వాదించు మనకుఁ దెలుపుమి
యేది ప్రతిన? యెది ప్రమాణ? మెవ రధ్యక్షుల్? 169.

గీ. ఏను గృహమేధిముఖ్యుండ నీవు భిక్షు
కాధిపతి విందు మనవిజయాపజయము
లకును బణనిర్ణయము సేయు మకుటిలముగ
నవుల వాదింతము జిగీష యచ్చుపడఁగ. 170.

క. ధన్యుండ నైతిని యతిమూ
ర్ధన్యుండు వివదింప నాకుఁ దారసిలుట, వా
గ్జన్యము రేపగు, నిప్పుడ
నన్యమతి నొనర్తు మధ్యమాహక్రియలన్. 171.

వ. అని యాబుధుండు నతపకాలము సమీపించుటఁ దెలిపి పునఃపున
రభివాదపూర్వకంబుగాఁ దనగృహంబునకు విచ్చేయఁ బ్రార్థిం
చుటయు, దండకమండలుధారియై యిలాగతుం డగుసరోజహితుం
డుంబోలె స్వశరీరకాంతుల దశదిశలు వెలింగించుచుఁ బాదచారియై
సహశిష్యసంతతికంబుగ మానియై శంకరార్యుండు రాజవీథిం జని
చని యొక్కయెడఁ గక్ష్యాంతరమ్ములు గడచి మండన మందిరమ్ము
దరియంజొచ్చి యర్ఘ్యపాద్యాద్యుపచారంబులం బడసి నిమంత్రిత

బ్రాహ్మణద్వయం బెదురు వచ్చి వందనంబు లాచరింప ముది
తుండై యుండునంత. 172.

శంకరుఁ డుభయభారతిని దీర్పరిగ నిర్ణయించుట.

ఉ. ఆసరసీజసంభవకులాభరణంబులు జైమినీయవై
యాసకశాస్త్రపారగు లటంచును వారలలో నొకండు ధ
ర్మాసన మెక్కి వాదముజయాజయముల్ ప్రకటించు నంచు సం
న్యాసివరేణ్యుతో విబుధనాథుఁడు దెల్పుచు నుండునత్తఱిన్. 173.

చ. కలువల నీనుసోగ తెలిగన్నులు వీనులకోన లానఁ జె
క్కులఁ జెలునవ్వు వెన్నెల లిగుర్పఁగఁ గొప్పవటూన్గళిన్ విభా
సిలఁ దెలిపట్టుఁగంచెలయుఁ జీరయుఁ దాలిచి విశ్వరూపుకో
మలి యరుదెంచి యయ్యతికి మన్నన మిన్నగ మున్ను గానరాన్.

క. పూఁదీవ కమ్మ తెమ్మెర
చే దునికిలునటుల వంగి, చేర్చి నొసంటన్
చేదోయి, వందనం బిడెఁ
బైదలి తను వీడ పౌఢి భక్తియు వంపన్. 175.

ఉ. ఆయెడ భట్టపాదుఁ డనినట్టినుడుల్ మది నెంచి శంకరుం
డాయతివర్ణ మహావిదుషి యంచుఁ దలఁచి బుధేంద్రుఁ గాంచి 'యే
లా యొరు లీవివాదముజయాజయముల్ వివరింప? నీవె యే
న్యాయము దీర్చు దాని దలయంద ధరింతుఁ దిరుద్ధిఁ బల్కతిన్'.

క. అనుటయు నందఱు నౌ నౌ
నని రమ్మండనుఁడు నాలు నంగీకృతిఁ దె
ల్పెను గర్మకాల మెఱిఁగి భ
వనాంతరాళమున కేఁగె బాడబ్యమ్మున్. 177.

ఉ. అందఱు లోని కేఁగి సరయూఁబున స్నానము లాచరించి మా
ధ్యందిసత్కృత్యముల్ నెఱపు నంతటఁ బైతృకకర్మదీక్ష ని
ష్పందతఁ దాల్చి మండనుఁడు భక్తియుక్తి సపర్యఁ దన్పెఁ గ
ర్మందిని వ్యాసజైమినులమాఱట యాక్షితిదేవయుగ్మముల్. 178.

గీ. మోదమున శంకరునకు హస్తోదకమ్ము
"నమృత మ"స్తని మండనుం డమర నొసఁగ
శాశ్వతబ్రహ్మలోకవాసమున కరిగి
రతనిపితరులు విశ్వదేవతలు నపుడ. 179.

ఆ. భక్ష్యభోజ్య చోష్యపానీయ లేహ్యాది
వివిధభోజనముల నవనిసురులు
ముగుర కిడిరి బ్రహ్మముగ సర్వ మెంచుచుఁ
దృప్తి గదుర గృహియు గృహిణి శ్రద్ధ. 180.

క. 'తృప్తాస్స్థ' యనఁగ ముప్వుర
సప్తార్చిస్సముల నన్నజలదానములన్
దృప్తుల నొనర్చి యనిపి ని
జాప్తులతో నన్నశేష మతఁడు భుజించెన్. 181.

గీ. చామర లిడంగ శిష్యు లిష్టప్రసంగ
ముల నొనర్చుచు వైదుష్యవిలసనముగ
భోజనాయాస మెడయ నమ్ముగురు కొంత
సేపు మొగసాలయందు నాసీనులైరి. 182.

క. ఆవిధి శ్రమ ముడిగి మహీ
దేవు లిరువు రరిగి రెవరితెన్నున వారల్
రేవాతీరగతం బగు
దేవాలయమునకు నరిగె దేశికవిభుఁడున్. 183.

చ. అరిగి కదంబసాలనివహాంచిత మానొకమండపంబునన్
స్థిరముగఁ గూరుచుండి నిజశిష్యులు కోరఁ గురుండు గేస్తుతో
జరిగిననాఁటివృత్తముఁ బ్రసన్నవచస్సరణిన్ వచించుచున్
జరిపెను నాఁటిరే యమృతసన్నిభమై క్రమియింపఁ జల్లగన్. 184.

శంకరమండనమిశ్రుల వాదసభ.

శా. ప్రాతశ్శోణసరోజబంధురుచి నభ్రం బుల్లసిల్లన్ యతి
వ్రాతాధ్యక్షుఁ డతండు కాల్యములు నిర్వర్తించి సచ్ఛాత్రుఁడై
ప్రీతిన్ మండనపండితౌకమునకున్ విచ్చేసి చొచ్చెన్ సుధీ
వ్రాతాలంకృత మాసభాభవనమున్ వాదంబు గావింపఁగన్ .185.

చ. సకలకలావిశారదను శారద నాత్మసధర్మిణిన్ సమా
ధికరహితన్ బ్రతీతపతిదేవత సాక్షిణిఁ జేసి వాదకౌ
తుకమున నుండె మండనుఁడు దొయ్యలియున్ బతియాజ్ఞఁ బాడ్వివా
కకృతికి మేకొనెన్ జనులు కన్నులపండువుగాఁ గనుంగొనన్. 186.

క. అధ్యాసించెను బరివ
న్మధ్యస్థితధర్మపీఠి మహిళామణి త
త్సుధ్యభిరూపత్వవివే
కాధ్యాస్థను వచ్చుశారదాంబికవోలెన్. 187.

గీ. మండనునివాదకుతుకసమ్మర్ద మెఱిఁగి
యలరుచుఁ బరావరజ్ఞుఁడౌ యతిమహేశుఁ
డూనెను బరావరైక్య సంధాన పరము
గా స్వకీయప్రతిజ్ఞ నుత్కంఠ నిట్లు. 188.

సీ. అనఘమై పరమార్థమై సచ్చిదమలమై
యద్వైతమై యొప్పునట్టిబ్రహ్మ
మనవధికాజ్ఞానమునఁ జిక్కి ముత్తెపుఁ
జిప్ప వెండిగను దోఁచిన తెఱఁగున

యావ జ్జగదాప్రపంచము వెలుంగును దత్ప
రావరైక్యజ్ఞాన మబ్బెనేని
విశ్వప్రపంచంబు విలయంబునొందునం
తన తెల్ల మగును స్వాత్మవ్యవస్థ
గీ. దాన నబ్బు నిర్వాణ ముత్తమము దానఁ
గలుగుఁ దప్పక జన్మమోక్షము ధ్రువముగ,
నిందులఁ బ్రమాణ మెయ్యవి యందు వేని
సకలనిగమాంతవాక్యప్రపంచంబు సువ్వె. 189.

చ. విజయముగొందు నిందు, నొకవేళఁ బరాజయమే ఘటిల్లుచో
నిజము వచింతు సంన్యాసననిష్ఠ సమస్తము వాసి, కావులన్
ద్విజవర! రోసి, తాల్చెదను దెల్పుల; వాదమునందులన్ జయా
పజయఫలంబు లియ్యుభయభారతియే మన కేర్పఱించుతన్. 190.

క. అనుచును శంకరభిక్షుం
డనల్ప మగుస్వప్రతిజ్ఞ నటుపూనఁగ మం
డనుఁడు స్వమతప్రతిష్ఠా
పన మగుశపథమ్ము నెఱపె స్పష్టముగ నిటుల్. 191.

సీ. చిదాప్రపవస్తువుఁ జెప్పఁ బూనఁగ శబ్ద
శక్తి కయోగంబు సంభవిలుట
నప్రమాణమ్ము వేదాంతమ్ము- లిఁకఁ బూర్వ
భాగమో యటుగాక, వాక్యగమిత
మైన యశేషకార్యంబులపట్లను
దాఁ బ్రమాణం బయి తనరుచుండుఁ
గనఁ గ్రియామాత్రంబునను బ్రసిద్ధమ్ములౌ
శబ్దంబులకు శక్తి సంఘటిల్లు

గీ. నాయువు సమాప్త మగుదాఁకఁ బ్రాణికోట్లు
సలుపవలెఁ గర్మకాండ మాసక్తి మిగులఁ
గర్మ మటు శ్రద్ధఁ జేయఁగాఁ గలుగు ముక్తి
యంతియే కాని లభియింప దన్యయుక్తి. 192.

క. వాదున జయేతరం బా
పాదిల్లిన నీప్రతినకుఁ బరమ విరుద్ధం
బూఁదెద నీ వనినటు లీ
నాదయితయె సాక్ష్యపదమునన్ వర్తిలుతన్. 193.

వ. అని. 194.

క. యతియున్ గృహపతియుఁ బరా
జితుండు శేతాశ్రమంబు సేకొనునట్టుల్
ప్రతిన లిటు నెఱపి యాభా
రతి నిలిపిరి సాక్ష్యవిష్టరభ్రాజిత గాఁగన్. 195.

మ. పరమోత్కంఠ యతీంద్రుఁడున్ గృహియు సభ్యశ్రేణి కై మోద్పఁద
త్పరిషద్వేదిక నాభిముఖ్య మమరన్ దర్భాసనాసీను లా
తఱి వారిర్వురకంఠసీమ సుమనోదామంబులం బూన్చి య
య్యరవిందాయతపత్రనేత్ర యనని ట్లాలింప సామాజికుల్. 196.

క. ఎవ్వరిగళమున విలసిలు
మవ్వపుఁబువుమాల తొలుత మ్లానం బగునో
యవ్వాని దరోటమి యగు
నెన్వరు వచియింపఁదగ్గ దే ముందు నిఁకన్. 197.

గీ. అంచు దివ్యప్రమాణ మయ్యతివ దెలిపి
యతియుఁ బతియు భుజింప భిక్షాశనముల
నాయుత మొనర్ప నంతర్గృహమ్ము సొచ్చె
నవుల వాదింప వారలు దివురుచుండ. 198.

శంకరశిష్యులకును, మండనశిష్యులకును జరిగిన వాదము.

క. మీ రేల మేము చాలమె
యారయుచుందుం డటంచు నాబుధుశిష్యుల్
పారాశరివరు శిష్యులు
నారంభించిరి వివాద మండఱు వినఁగన్. 199.

వ అందు మండనశిష్యుం డొక్కరుండు శంకరగురుచ్ఛాత్రు నొక్కనిఁ
గాంచి. 200.

క. ఓయతిశేఖర! నీవు తు
రీయాశ్రమ మెట్లు గొంటి స్మృతులున్ శ్రుతులున్
వేయిగతుల సన్న్యాసం
బీయుగమునఁ ద్యాజ్య మనుట యెఱుఁగవె యకటా. 201.

గీ. మఱియు శ్రుతులును స్మృతులుఁ బ్రమాణములుగఁ
దెలియఁ బల్కెద వినుమయ్య! కలినిషిద్ధ
ములు తురగమేధ గోమేధ పలంపైతృ
కాఁతిమాశ్రిమ దేవరన్యాయవిధులు. 202.

సీ. యజ్ఞాధ్యయనహీన మానాశ్రమచతుష్ట
యమ్ము బ్రాహ్మణ్య మెట్లనువుపఱచు
'నహరహ స్సంధ్యా ముపాసీత' యనువిధి
దూరుఁడై యగునె శుద్ధుఁడు ద్విజుండు
యజ్ఞోపవీతచూడాపవర్జనమున
నిరయమ్ము ద్విజుఁ డెట్లు నిస్తరించు
సత్కళత్రమునందు సంతతిఁ గనక వి
పుత్రుం డెట్టుల పితౄణమును దొలఁగుఁ

గీ గాన వేదోక్త కర్మసంధానపరత
నంది యతియపుణ్యలోకాప్తిఁ గోర
వలయునే కాని యతి యాట కలియుగమునఁ
దలఁపరాని దటంచు విద్వాంసు లనరె. 203.

చ. యతివర! స్వర్గరాజ్యతనయాదికముల్ లభియించుఁ గర్మప
ద్ధతిఁ జరియింప నంచు శ్రుతితత్త్వవిదుల్ ద్విజు లెల్లఁ గర్మముల్
మతి నొనరింతురు; కర్మ మణుమాత్రము వాయఁగరాని దంచు న
చ్యుతుఁడు కిరీటికిన్ దెలుపుసూక్తి నెఱింగియు భ్రష్టు లైతిరే.

గీ. కర్మమును గాల మెఱిఁగి తత్కర్మ మర్త్య
కాలమున సల్పువానినే జ్ఞాని యండ్రు
విహితకర్మాచరణనిష్ఠ వెలయువాఁడె
భక్తిమంతుండు మఱి జ్ఞానవంతుఁ డనఘ. 205.

ఆ. కలినిషిద్ధ మనుట తెలిసియు సన్న్యాస
మెట్లు మీగురుఁడు గ్రహింపఁ దెగియె
నందు బ్రహ్మచారి యయి సన్న్యసించెనే
ప్రక్రమంబు విడిచి వక్రబుద్ధి. 206.

క. అన శంకరశిష్యుం డనె
మనీషివర! యింత చదివి మందప్రజ్ఞన్
జనసుత్యం బగుజ్ఞానం
బు నెఱుంగక యుంట యబ్రముగఁ గన్పట్టున్. 207.

క. ఎందాఁక వర్ణభేదం
బెందాఁక శ్రుతిప్రచార మెసఁగుఁ గలియుగం
బం దంతదాఁక నిలుకడ
నొందును సన్న్యాస మగ్నిహోత్రము లుర్విన్. 208.

మ. మఱి సంతానజదోషసంహతులఁ గర్మప్రాప్తదోషంబులన్
దరికొల్పన్ దమవహ్ని స్వర్ణమటు సన్న్యాసంబు; సంసారమం
దరయన్ రాగవిదూరుఁ డౌతఱియు సన్న్యాసప్రాప్తికిన్ గాల మం
దురు శాస్త్రజ్ఞులు, బ్రహ్మచారియు విరక్తుండైన నర్హుం డగున్.

సీ. సకలచరాచరస్థానమై వెలుఁగొందు
బ్రహ్మంబె యజ్ఞసూత్రంబు గాఁగఁ
బరమవిజ్ఞానభాస్వద్దీపకళికయే
జానైన కేశపాశంబు గాఁగ
జన్మమృత్యుభయార్తి సమయించు ముక్తియ
యమృతోపమాన యర్ధాంగి గాఁగ
నాత్మైక్యజాత మహానంద ముద్రాను
భవ మాత్మజాత లాభంబు గాఁగ
గీ. నేను నీ వనుభేద మొక్కింత లేక
జగమె తా నయి యుంట సంసారముగను
బరమవిజ్ఞాని భాసిల్లు నిరత మైన
సచ్చిదానందరససమాస్వాద మెనసి. 210.

గీ. వాఁడె యజ్ఞోపవీతి యవ్వాఁడె శిఖియు
వాఁడె సూదారవంతుఁ డవ్వాఁడె పుత్ర
వంతుఁ డగు; వాఁడు పొందులాభంబు బ్రహ్మ
కైన హరికైన హరునకు నైనఁ గలదె. 211.

గీ. యజ్ఞసూత్రంబు కర్మాంగ మనిరి బుధులు
కర్మములె వీడుచోఁ దదంగంబు సూత్ర
మేల తాల్పఁగవలె? జ్ఞాన మెపుడు పొడమ
నపుడు శిఖఁ దాల్పుకున్న నే మగుఁ గొఱంత. 212.

ఉ. కావున యజ్ఞసూత్రము శిఖల్ త్యజియించును యోగి; కర్మతం
త్రావిలబుద్ధిఁ దాలిచి నిరంతరకర్మఫలానుభోక్తయై
పోవుచు వచ్చు చెందుఁ గడకుట్టఁగఁ జాలక జీవభావముల్
దోవఁగఁ జాలఁ డంచు విబుధుల్ వచియింతురు పెక్కురీతులన్. 213.

సీ. కటిసూత్ర మాచ్ఛాదకముగఁ గౌపీనంబు
శీతార్తిఁ బాపి రక్షింపఁ గంథ
నక్షమాలిక నవ్రణాక్షీణవైణవ
దండంబు నుదకమండలువును
మధుకరవృత్తిసంపాదితానేకాన్న
భుక్తి శిఖాసూత్రములవిముక్తి
నిత్యకర్మాదికనిరసనంబును బర
బ్రహ్మానుసంధానపాటవంబు
గీ. నిరతరమును బూని జ్ఞానసందీప్తి నెనసి
మాక్తికప్రోతసూత్రసంభావనమునఁ
బరమహంస గనందగు బ్రహ్మతేజ
మాపిపీలిక మాబ్రహ్మమైన జగతి. 214.

గీ. అనుచుఁ జకచక మనుదివ్యమైనవచన
రచన యతిశిష్యుఁ డాగృహిప్రథమశిష్యు
నధరము మెదల్పనీయక యాఁకవేట్టు
నంత; విన వచ్చె మధ్యాహ్న మయ్యె ననుచు. 215.

వ. తోడన గోష్ఠి చాలించి సాంతేవాసులై యతియుం గృహపతియు
నిశాంతాభ్యంతరమ్మున కరిగి మాధ్యాహ్నికక్రియాకలాపనిర్వర్తన
పూర్వకంబుగా భిక్షలు భోజనమ్ములు నిర్వర్తించుకొని విశ్రాంతి
నెఱుంగకయ యప్పుడ గోష్ఠీమందిరము సొచ్చి వివిధవిద్వజ్జనసమ

ఘంబున నిరువాగుశిష్యులు సకలశాస్త్రసమ్మతంబుగా నాసాయము వాదము సేయఁ జూచుచు దివసావసానమున యథేచ్ఛ మఱిగి, రమ్మ ఱుదినమునుండి యథాపూర్వము సపరివారంబుగ పరిష త్తలంకరించి యుత్తరోత్తరము లగు ఛాత్రులవాదము లందలి జయాపజయం బుల మోదవిషాదము లొందుచు వచ్చుచుఁ బోవుచుఁ ద దేకధ్యా నమగ్నమానసులై దివసపంచకం బేఁగించి షష్ఠవాసరమున వేఁ బోకఁ గరణీయంబులు తీర్చుకొని సభకు విచ్చేసి మాలాలంకృత కంధరులై శంకరమండనులు తామె వాదమునకుఁ బూనుకొని రయ్యవసరంబున. 216.

ఉభయభారతీసాక్షికంబుగ శంకరుఁడును మండనుఁడును వాద మొనర్చుట.

శా. నానాదేశసమాగతుల్ బుధులు నానాటన్ గుముల్ గట్టి యా
స్థానం బెల్ల నలంకరించి విన నుత్సాహంబుతో నుండ, శి
ష్యానీకంబులు నొజ్జలన్ బలసి యాయాగ్రంథముల్ చేతఁ గం
దీ నుండన్ గనవచ్చునాగరజనం బేసద్దు లేకున్నెడన్. 217.

ఆ. సాధువాద మొకట సభ్యులు గావింప
శ్రుతుల సాక్ష్యమున స్వమతము నిలుపు
కొనుచు నొండొరులకుఁ గుతుకమ్ము మోదమ్ము
గూర్చునడుల వాదు కొనలు నిగిడె. 218.

ఉ. ఒండొరులున్ బ్రగల్భు లయి యుత్తరముల్ విదళించు చర్థిఁ గూ
ర్చుండి స్మితాంచితాననము లొప్పఁగ మేనుల స్వేదకంపముల్
మెండుకొనంగ మిన్నుదెస మిన్నక చూచుచు, నుత్తరంబు లే
కుండుచుఁ, గ్రోధవాక్యములు నొందుచు నుండిరి యిర్వురయ్యెడన్.

గీ. అపుడు క్షోదక్షమం బైన యాబుధేంద్రు
దాక్ష్య మరసి యతీంద్రుఁ డుద్దవిడిఁ మాల్చె

క్షోభితాఖిలపక్షు సతోఽవిదాంతి
శాప్రకాశితకక్షుని నల విపక్షు. 220.

ఉ. అంతట మండనుండు స్వమతావననైపుణశూన్యుఁ డయ్యె వే
దాంతవచఃప్రసిద్ధ మయి యద్వయమార్గము సూపునట్టిసి
ద్ధాంతములన్ బరశ్శతవిధంబులఁ దూల్చుచుఁ బల్కఁజొచ్చె ని
శ్శ్లాంతయు మచ్చరంబు జనియించి జయించుతలంపు మించఁగన్.

క. శమధన! హేయోపాదే
యముల విడిచి సిద్ధ మగుపదార్థముఁ దెలుపన్
క్షమ మగు వేదాంతోక్తులు
ప్రమాణ మనఁగఁ బొసఁగు నెటు పరిశీలింపన్. 2 2.

గీ. కర్తృతాధర్మయుక్తుఁడై క్రాలు జీవుఁ
డీశ్వరుఁ డకర్తృతాధర్మ మొనసి యుండు
నట్టి ప్రవిరుద్ధధర్మాశ్రయముల కెట్లు
లైక్య మమరుఁ? బ్రమాణ మిందరయ మనిన. 223.

గీ. యతివరుం డను నుద్దాలకాదిగురులు
శ్వేతకేతుప్రముఖశిష్యవితతిఁ 'దత్త్వ
మసి' యనుచు నైక్య మెఱిఁగించి యలరఁజేయు
వాక్యము ప్రమాణ మగు బుధవర్య! యనుచు. 224.

మం. హుంఫడాదులమాడ్కిఁ బాపోపశాంతి
కై జపార్హమ్ము లైనవేదాంతవిదిత
తత్త్వ మస్యాదివాక్యము లర్థమ్మనను వి
వక్ష యెటు లొప్పఁగల్గుఁ జెప్పంగదన్న. 225.

శం. అర్థవిదులు హుంఫడాదిశబ్దమ్ము ల
ర్థాప్రతీతిచే ననర్థ మనిరి

యర్థ మిట్లు తెల్ల మఱుచుండఁ దత్త్వమ
స్యాదికము జపార్థ మనుట యెట్లు? 226.

మం. పన్నుగఁ 'దత్త్వమసి' యనుట
విన్నన్ జీవేశ్వరుల కభేదము స్మృత మా
కెన్న మఖకర్త యీశా
భిన్నుం డను స్తుతినిబోలి విధిశేష మగున్. 227.

శం. యూపముఖాధ్వరాంగములయుష్ణకరాదిసురాకృతిస్తవా
లాపము కర్మకాండపరిబద్ధము గావున నర్థవాదతా
ప్రాపణ మొప్పుఁ గాని యెటు పల్కెదు తత్త్వమసీతివాక్యమా
రా! పరకాండదృష్టముగదా 'విధిశేషమ' యంచు ధీనిధీ. 228.

మం. మ. పవమానాన్నమనోర్కులాదియగునబ్రహ్మంబునన్ బ్రహ్మబు
ద్ధి విధింపన్ జనుమాడ్కిఁ గర్మపరివృద్ధిం గోరి యీసూక్తి దాఁ
దివుచున్ జీవునివంక బ్రహ్మమనుబుద్ధిన్; గాన నారోపితా
త్మవిభాసం బగుజీవుఁ గొల్చునిగమాంతంబుల్ ప్రమాణంబులే.

శం మనమునుబ్రహ్మమంచుఁగొలుమా యనువాక్యమునందుబ్రహ్మభా
వనకు లిజాదికంబు గనుపట్టినయట్లుల ధీవరా! విధా
ననియతి తత్త్వమాదివచనంబుల నున్నదె? జీవునే యుపా
సన మొనరించు నయ్యుపనిషత్తు లటంటివి సత్య మెట్లగున్. 230.

మం. చ. యతివర! రాత్రిసత్రమునయందు విధిన్ ఫలదర్శనాప్తి నే
గతి ఘటియింతు, రాపగదిగా నిట ముక్తిఫలశ్రుతిన్ బ్రక
ల్పితవిధి యంచు నీశ్రుతి వివేచనసేయుట పాడి, కానిచో
వితథము గాదె యద్ది "పృథివీపతి రేష" యటన్నకైవడిన్. 231.

శం సరి నీ వన్నటులేని మోక్షము క్రియాజన్యంబు కానన్ విన
శ్వర మా స్వర్గమువోలె, సల్పఁగను సల్పన్ మానఁగా నన్యమా

కరణిఁ సల్ప వశం, బుపాసన మనఃకార్యంబు దా నౌట; న
న్కారణిఁ గామిని జ్ఞానలబ్ధ మగుమోక్షం బెన్న నిత్యం బగుఁ. 232.

మం. తత్త్వ మసి యనుసూక్తి నీతలంచినట్లు
లే యుపాసనాపర్యవసాయి గాక
పోవుఁగా, కీశ్వరునితోడ జీవునకును
దెలుపుచుండుట లేదె సాదృశ్య మనఘ 233.

శం. సాదృశ్యం బనఁ జేతనత్వాన్వితమా? సార్వజ్ఞ్యసార్వాత్మ్యధ
ర్మాదిప్రాప్తమొ? యెక్కియఁ దెలిపెన్ సాద్యం బంటివేసిఁ బ్రసి
ద్ధోదంతమ్ము వచించు టెందులకు? నోహో యన్య మంచేని ద
ద్భేదస్థాపక తావకీనమతసూక్తిప్రాతికూల్యం బగుఁ. 234.

మం. ఆత్మగుణనిధి సుఖవిబోధాదిగుణము
లల యవిద్యావృతిని జీవునం దభాస
మాన మగుఁగాక; నిత్యతామాత్రమునన
సామ్యము వచింప నుక్తదోషంబు తొలఁగు 235.

శం. నీ వనువాక్యభక్తినె మనీషిమణీ! "పరమాత్మభావ మా
జీవున కబ్బు నా" పలుకఁ జెందఁగ నెందులకయ్య? యయ్యవి
ద్యావరణంబునుండి పరమాత్మత కౌ ప్రతిభాసశంక నీ
వే వెడలించినాఁడవుగదె నిజ మారయుమా మనంబునన్. 236.

మం. జీవుతోఁ జేతనత్వమ్ముచే జగత్ప్ర
సూతి యగునాత్మకును సాటిఁ జూపుత; జగ
మనఘ! చిజ్జన్య మగుట సాంఖ్యాదికథిత
మగుప్రధానాదివాదమ్ము లంతరించు. 237.

శం. అటు లగునేని 'తత్త్వ మసి' యంటకు నీమతమందు 'అస్తి' యం
చటఁ బలుకన్ వలెంజుమి 'తదైక్షత' యన్నశ్రుతిఁ గనన్ జగ

ఘటితజడత్వశంక తొలఁగంగఁ దదీక్షణశబ్ద మొప్పఁగా
నటుల; ప్రధానవాదము నిరాసముసేయు టసంగతం బగున్. 238.

మం. 'నాహ మీశ్వర' యనెడుభేదావగమము
తత్త్వమసివాక్యజన్యబోధమున కతి వి
రుద్ధమై యుండ నైక్యసంసిద్ధి కలదె?
యదియు స్వాధ్యాయవిధి జపార్థంబ సూవె. 239.

కం. భేద మొటిఁగెసి శక్తి యవ్విషయముకన్న
నాదనెసి నభేదవాదవేదోక్తిబాధ
కరణమునకు భిదాసన్నికర్ష మమర
దెట్లు ప్రత్యక్ష మనెదు జీవేశ్వరభిద. 240.

మం. ఈశభిన్నుఁడ నే నన నెసఁగుభేద
శబ్ద మాజీవునకు విశేషణ మగుటను
గలుగుఁ దత్సన్నికర్షమ్ము; కరణభేద
ములకు * సంప్రయోగాభావ మెలయుచున్న. 241.

శం. కనద యతిప్రసక్త మగుఁ గానఁ దదేకవిశేషణత్వ మే
యనువున సన్నికర్షత; భిదాశ్రయ మింద్రియసన్నికృష్టమై
తనరినో విశేషణత దాఁ గనఁజాలును సన్నికర్షతన్;
గనఁగదె సన్నికర్ష మెటు గల్గు నతీంద్రియ మైనయాత్మకున్. 242.

మం. అరయ భేదాశ్రయ మ్మగునాత్మ కింద్రి
యమున సన్నికర్షమ్ము లే దంటి నహహా
ద్రవ్యములె కానఁ జిత్త మాత్మయును నాని
కబ్బఁగాదె సంయోగసమాశ్రయత్వము. 243.

---

* సంయోగాదికసన్నికర్షము లేకున్నను.

శం. ఆఁగుము పల్కు, కాత్మ విభువౌ నటుగా కణు వౌతఁ జిత్తసం
యోగిత రెండుపక్షముల నూహ యొనర్చినఁ గానరాద యో
* యోగివరేణ్య! సావయవ మొందును సావయవంబుతోన సం
యోగము, గాని తా నవయవోజ్ఝితుతో నెపుడేనిఁ బొందునే 244

చ. మన సొకయింద్రియంబ యని మాటకు నంటిమి- లోచనాదికం
బునకు సహాయమాత్రి మయి పొల్చును దీపమువోలెఁ గావునన్
మనసున కింద్రియత్వ మణుమాత్రము లేదిఁక 'నింద్రియంబులన్
మనసును నేన' యంట 'యుడుమండలిఁ జంద్రుఁడ' నన్నరీతి నా.

మం. అక్షతతిని భేదజ్ఞాన మబ్బదేని
వరలుఁగాక సాక్షిస్వరూపమయి; దాని
తో విరోధ మెనయునీశజీవు లొక్కఁ
డన నెటు ప్రమాణ మాతత్త్వమాదకోక్తి. 146.

శం. అలయవిద్యావృతుం డైనజీవునకు మా
యావృతుం డగు పరమాత్మునకును
సాక్షిస్వరూపమై జానొందుప్రత్యక్ష
మెఱిఁగించు భేదంబు పరఁగినట్లు
యాశ్రుతి శుద్ధజీవాత్ములయైక్యంబుఁ
దెలుపు భిన్నాశ్రయంబులు గనుటను
నవిరోధ మగును- గా దంటేని ♦ పూర్వమై
వెలయుప్రత్యక్షంబు బలవిహీన

* మండనుని సంబోధించుట.

♦ 'పౌర్వాపర్యే పూర్వదౌర్బల్యం ప్రకృతివత్' అను జైమినీ యసూత్రము ననుసరించి 'ప్రత్యక్షము- శ్రుతి' యను నీరెండిటఁ బ్రథమమగు ప్రత్యక్షమును చరమమగుశ్రుతి బాధించునుగదా 'పూర్వం

గీ. మఱి (3) యపచ్ఛేదనయరీతి ననుసరించి
చరమ మగుశ్రుతిచే బాధ పొరయఁ గాదె
మును గలుగురజతజ్ఞానమునకుఁ బిదపఁ
గలుగు శుక్తిప్రమ ప్రబాధక మ్మగునట. 247.

పర మజాతత్వా దబాధిత్వైవ జాయతే । పర స్యానన్యథోత్పాదా న్నత్వబాధేన సంభవః' అను శాస్త్రమునఁ బరము పుట్టనికారణమునఁ బూర్వశాస్త్రము దేనిని బాధింపకయే పుట్టును. ఇఁకఁ బరశాస్త్రమో పూర్వశాస్త్రబాధకుఁ గాక యితరథా పుట్టనే పుట్టదు. కావునఁ బర మెల్లప్పుడు బాధకమే యగును. ఎట్లనఁ:— ప్రకృతియాగమునఁ గృతోపకారు లగుకుశలు ప్రథమాతిదేశమున వికృతియాగమునఁ బ్రసక్తము లయ్యును గల్వ్యములును, జరమభావులు నగునిరపేక్షము లైనశరములచే బాధింపఁబడుట లేదా? అట్లే యిందును.

(3) అపచ్ఛేదన్యాయము:— బహిష్పవమానస్తోత్రము నుద్దేశించి యన్వారబ్ధముగా గమనము చేయుచుండు ఋత్విజులలో నుద్గాతకుఁ గచ్ఛాపచ్ఛేదము కలుగుచో 'య ద్యుద్గాతాఽపచ్ఛిద్యేత అదక్షిణం యజ్ఞం నిష్పాద్య తేన పున ర్యజేత' యను శ్రుతిచే నారంభింపఁబడిన క్రతువును దక్షిణారహితముగ సమాప్త మొనర్చి, సదక్షిణాకముగ మరల యజ్ఞము చేయుట ప్రాయశ్చిత్తముగా విధింపఁబడె. ప్రతిహర్తకుఁ గచ్ఛాపచ్ఛేదము కలుగుచో 'యది ప్రతిహర్తాఽపచ్ఛిద్యేత సర్వవేదసం దద్యాత్' అను శ్రుతిచే సర్వధనదానరూప మైన దక్షిణతో నారబ్ధయాగము సమాప్త మొనర్చుట ప్రాయశ్చిత్తముగా విధింపఁబడె. క్రమమున నుభయాపచ్ఛేదము కలుగుచోఁ దొలిదాన దక్షిణారాహిత్యము, రెండవదాన సర్వస్వదక్షిణయును నుభయమునకు విరోధము కావున నుత్తరనిమిత్తకప్రాయశ్చిత్తముతోడనే యారబ్ధక్రతుసమాప్తి నొనర్పవలె' ననెడు నపచ్ఛేదన్యాయమునఁ బూర్వ మగు ప్రత్యక్షము పరమగు శ్రుతిచే బాధిత మగును.

మం. సంయమీంద్ర ఘటాదికసరణి జీవుఁ
డఖిలవిత్త్వము లేమిఁ బరాత్మభిన్నుఁ
డగు ననెడియ ననుమానాన నయ్యభేద
వేదమున కష్ట బాధ రాలేదె కనుమి. 248.

శం. నీవు నుడివిన భేదమ్ము నిక్కమొక్కొ
కాల్పనికమో వచింపు నిక్కంబయేని
దవులు దృష్టాంతహాని రెండవదయేని
సిద్ధసాధనదోషంబు సెందు మరల. 249.

మం. వినుము స్వప్రత్యయాబాధ్యభేదవత్త్వ
మంఘటాదికమందు సాధ్యంబు సూవె
* యాత్మబోధముచే నబాధ్యప్రభేద
మొప్ప ననినంత నేదోష మున్నదయ్య. 250.

శ. ఎనయ స్వశబ్దము బోధిం
చినది సుఖాదులను జెందుజీవుఁ డనిన మా
♦ కు నభీష్టము—తద్రహితే
శుని నన దృష్టాంతహాని చొప్పడు మరలన్. 251.

---

* ఘటజ్ఞానముచేఁ బటజ్ఞానము బాధింపఁబడనట్లు స్వజ్ఞానముచే నబాధిత మగు భేదము ఘటాదులందు సాధ్యము' అని మామతము. ఆత్మజ్ఞానముచే భేదమునకు బాధ లేదని నీమతము (అద్వైతము) నగుటచే సిద్ధసాధనదోషము తొలఁగినది.

♦ స్వప్రత్యయాబాధ్యభేదాశ్రయత్వరూపసాధ్యమునందు స్వశబ్దమున కర్థము సుఖాదుల నొందుజీవుఁడా? తద్రహితుఁ డగుపరమాత్మయా? జీవుఁ డనినచో నట్టి భేదాశ్రయత్వము మాకును నిష్ట మగుటచే సాధింప నక్కఱలేదు. అనఁగా సిద్ధసాధనదోషము. పరమాత్మ యనినచో ఆత్మజ్ఞానముచే సర్వజ్ఞానములు నశించుఁ గాన దృష్టాంతమైన ఘటమందు ఆత్మప్రత్యయాబాధ్యభేదాశ్రయత్వరూపసాధ్యము లేదు.

మం. వ. యోగీంద్రా! మామతమున దీయనుమానప్రమాణమున జీవే శ్వరులకు నిరుపాధికము సాధ్యము. నీమతమున జీవేశ్వరుల కౌపా ధిక భేదమే కదా. అదియు యుగ్మెడల నుపాధియగు నవిద్య తత్త్వ జ్ఞానముచే నివర్తింప భేదమునకు మిథ్యాత్వము సిద్ధించుం గా వున నీవు సాధించునది జీవేశ్వరుల కౌపాధికభేదమును మేము సా ధించునది నిరూపాధికభేదము నగుటంజేసి సిద్ధసాధనదోషము పరి హృతం బయ్యెం గాదె. 252

శం. ఆర్యా! నిరుపాధిక భేదంబునకు (6) దృష్టాంతముగాఁ జూపఁబడిన ఘటేశ్వరభేదముగూడ నవిద్యోపాధిక మగుటచే నచ్చట నిరుపా ధిక భేద మంగీకరింపఁబడమింజేసి దృష్టాంతహాని కలిగెను మఱి యు నీయనుమానమున 'సాధ్యవ్యాపకత్వే సతి సాధనావ్యాపకత్వ ముపాధిః' అను లక్షణముఁబట్టి బ్రహ్మనిరూపిత నిరూపాధికభేదము ఘటాదులందుఁ దప్పక యుంటంజేసి సాధ్యవ్యాపకమై, యసర్వ జ్ఞత్వరూపసాధనము గలజీవునియందు జడత్వము లేకుండంజేసి సాధనావ్యాపకత్వము గల జడత్వ ముపాధియగుటచే నీవు హేతు వనుకొనినది సోపాధికమై హేత్వాభాస మగుచున్నయది. మఱి యు 'ఆత్మా పరస్మా దభిన్నః, చిత్త్వాత్, పరవత్ (పరమాత్మ వత్) అను ననుమానముచే జీవునకుఁ బరమాత్మాభేదమును సా ధించుచిత్త్వరూపహేతువు గలుగుటంబట్టి నీచూపినహేతువు స త్ప్రతిపక్షితము గూడ నయ్యెనే. 253

మం. వ. (బ్రహ్మపక్ష మగుననుమానము ప్రయోగించి సిద్ధసాధ్య త్వాదిపరిహారమును శంకించుచు) బ్రహ్మ జీవప్రతియోగిక ధర్మి ప్రమాఽబాధ్యభేదవత్ । సంసృతిశూన్యత్వాత్ । అని మేము సా ధించుచుంటంజేసి జీవభేదము బ్రహ్మజ్ఞానబాధ్య మని నీ వొప్పు

(6) దృష్టాంతము వాదిప్రతివాద్యుభయసంప్రతిపన్నమే కావ లయు నని శాస్త్రనియమము.

దానికి విపరీతముగనే సాధించుచుండుటచే సిద్ధసాధనదోషము లేదు.
ఘటాదిప్రమచే జీవభేద మబాధ్యమని నీ వంగీకరించుటంజేసి
దృష్టాంతహానియు లేద. 254.

౪౦. అజీవప్రతియోగికభేదము యావద్ధర్మిప్రమాబాధ్యము కాదని
యా? యత్కించిద్ధర్మిప్రమాబాధ్యము కాదనియా? అచ్చట ఘట
గతమైన జీవభేదమునకుఁ గూడ స్వధర్మిబ్రహ్మజ్ఞానబాధ్యత్వము
స్వీకరించుటచే యావద్ధర్మిజ్ఞానాబాధ్యత్వము సంప్రతిపన్నము కా
మిం దృష్టాంతహాని ఘటిల్లుటంజేసి ద్వితీయపక్ష మాశ్రయింపనెంచ
నందు స్వరూపాతిరిక్త భేదవాదిమతమున ఘటాదికమందు బ్రహ్మ
మందును గలజీవభేద మేకమే గావున నాభేదధర్మి యైన ఘటము
సంబంధమగు జ్ఞానము నబాధ్యమైన జీవభేదము బ్రహ్మయందు
మా కంగీకృత మగుటచే నీకు సిద్ధసాధనదోషము. ఇంతియ కాదు.
సాధ్యకోటియందలి ధర్మిపదముచే వివక్షితము సగుణమా? నిర్గుణ
మా? సగుణ మందువేని సగుణస్వరూపజ్ఞానముచే భేదమున కబా
ధ్యత్వము మా కిష్టమగుటచే సిద్ధసాధనదోషము. నిర్గుణ మందు
వేని యదియు దోషాయత్తమే యగు నెట్లంటేని వినుము. ఆనిర్గు
ణస్వరూప మైనబ్రహ్మము తాను బక్షముగాఁ బ్రమిత (ప్రమాణ
సిద్ధ) మై యగునా? యప్రమితమై యగునా? అందు ద్వితీయపక్ష
మున నాశ్రయాసిద్ధి కలుగు, నిఁకఁ బ్రథమపక్షమం దన్ననో:—
జీవాభిన్నముగాఁ బరమాత్మ తత్త్వమస్యాది వేదాంతవాక్యములం
బ్రసిద్ధమగుటచే నీవు చూపిన యనుమానమువలన నావేదాంత
ప్రమాణమునకు బాధ కలుగు 'జ్యోతిష్టోమో న స్వర్గఫలదః,
క్రియాత్వాత్, మర్దనక్రియావత్' అను ననుమానము 'జ్యోతిష్టో
మేన స్వర్గకామో యజేత' అను వేదవాక్యమునకు విరుద్ధార్థబోధ
కమగుటచే నెట్లాభాసరూపమో నీయనుమానమును నట్టిది.

మం (అనుమానస్థాపనమునం దసమర్థుఁడై యామార్గము వదలి శ్రుతి
విరోధము చూప నెంచి) 255.

ఉ. వాసి చెలంగఁ "దత్త్వమసి" వైదికసూక్తిని దూల్చు 'ద్వాసుప
ర్ణా సయుజా'యుటన్న*శ్రుతిరాజము; జీవున కాత్మకున్ భిదా
న్యాసము గల్గ నయ్యెరువురం దొకఁ డాస్థను బిప్పలాదియై
భాసిల; నొం డభోక్త యయి భాసిలు నం చెఱిఁగించి మస్కరీ.256

తం. గీ. వినుము ప్రత్యక్షసిద్ధమై విఫల మగుప
రాత్మభిద కేల శ్రుతి మాన మగుట; నితర
థా తెలియఁగాదె యద్ది; స్వార్థమ్మునం ద
తత్పరము లయ్యు నర్థవాదములు దనరు. 257.

వ. అజ్ఞాతార్థంబునందు శ్రుతికిఁ బ్రామాణ్యము జైమిని చెప్పుటంజేసి
ప్రత్యక్షసిద్ధమును ఫలరహితము నగుజీవాత్మభేదము దెలుప శ్రుతి
యేటికి? తత్త్వమస్యాదివాక్యవిరుద్ధము లగునేతాదృశశ్రుతులు స్వా
ర్థమునం దతత్పరములయ్యు నర్థవాదమాత్రములు గాకపోవు.

మం క. శ్రుతిమూల మగుట గీతా
స్మృతిప్రసిద్ధార్థవాక్యరీతిఁ, బ్రమాణ
స్థితిఁ గనుఁ బ్రత్యక్షసమా
ర్జితార్థవాక్యమును నిగమాజీవిక యగుటన్. 259.

వ. "క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత" యను గీతా
వాక్యమునకు మూల మగు తత్త్వమసి యనుశ్రుతి ప్రమాణమగు
నట్లే ప్రత్యక్షమునే సిద్ధమగు నర్థము బోధించు 'ద్వాసుపర్ణా'యను
నీయభేదశ్రుతియుఁ బ్రమాణమే యగును. 260.

---

*శ్రుతి. ద్వాసుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే, తయో రన్యః పిప్పలం స్వాద్వత్త్యనశ్న న్నన్యో అభిచాకశీతి. అని

శం. వేదమూలం బగుట వేదవిత్స్మృతాగ్ర
మందు స్మృతియు ప్రమాణమా నంమవేని
యెటు స్మృతి ప్రమాణ మగును జీవేశభిదను
స్మృతులవాజ్ఞులు సైత మెఱుంగుదాన. 261.

ఉ. ఆనిగమంబు జీవపరమాత్మలఁ జెప్పు నటంచు మాటమా
త్రాసను నంటేఁగా, కిది యథార్థము- సత్త్వమునుండి వేర్పడం
గా నలపూరుషుఁ దెలిపి క్రిచ్చుట వానికి సర్వసంసృతి
న్యూనత పాదుకో నుడువుచున్నది తన్నిగమమ్మె యెన్నఁగన్.267.

మం. దేవ యీశ్రుతి సర్వజ్ఞజీవులను ద్వ
జించి తా సత్త్వజీవులఁ జెప్పునేని
జడమునకు భోక్తృతను జెప్పఁజాలు నేత
దాగమమునకుఁ బ్రామాణ్య మమరు టెట్లు? 263.

శం. నేము నీ కళంకనీయుల మాపైంగ్య
మగురహస్య మిట్లు వ్యాఖ్యసేసె
'సత్త్వ' మంచు 'నభిపశ్యతి జ్ఞ' యం
చు నదనీయ మంత్రమునకు సరిగ. 264.

వ. ఎట్లంటేని 'తయో రన్యః పిప్పలం స్వా ద్వత్తీతి సత్త్వం, అనశ్న న్నన్యో అభిచాకశీ త్యనశ్న న్నన్యో అభిపశ్యతి జ్ఞః, తావేతౌ సత్త్వక్షేత్రజ్ఞౌ' అని పైంగ్యరహస్యము. పిప్పలభోక్త సత్త్వ మనియు నభోక్తయై సాక్షిమాత్రుఁడుగా నుండువాఁడు క్షేత్రజ్ఞుఁ డనియు వివరించుటఁ జేసి సత్త్వజీవులను గ్రహించిన మావాదము నీ కళంకనీయము. 265.

మం. ధీర సత్త్వశబ్దమ్ము శారీరవాచి
యగుట క్షేత్రజ్ఞపదము పరాత్మవాచి
యగుటఁ బైంగ్యరహస్యాదితాత్పర్యమునను
నల్లవాక్యమ్మునకుఁ దోఁప దన్యపరత. 266.

సీ. అనఁ జిత్సుఖాదు లి ట్లనిరి 'భవన్ని దే
శమున సనందనుం డమలచరితుఁ
డొనరించుఁ మీరాతలంచిన భాష్యము నిబంధ
న మ్మెల్ల నొక్క క్షణమ్ములోన
బ్రహ్మచర్యమునుండి పడ సెఁ దురీయాశ్ర
మము శేముషీప్రకర్షమున వెలసె
జను లెల్ల రానందమున మునింగెదరు త
ద్రచన జాతఁడె సమర్థత గలాఁ'డ
గీ. టంచు నమ్మండనునికంటె నర్హుఁ డన్యుఁ
డుండె నని తెల్పుచుండు శిష్యులకు ననియె
భాష్యమున కన్య మైన నిబంధనమ్ము
పొందుగాఁ జేయుఁగాక సనందనుండు. 226.

ఆ. తివిరి తాఁ బరప్రతిజ్ఞ మావార్తిక
మతఁడు సేయ వలవ; దది యొనర్పఁ
గా సురేశ్వరుండు గావించెఁ బ్రతిన దీ
క్షను వహించెఁ గానఁ జనదు మాన్ప. 227.

క. అని శిష్యుల నాదేశిం
చినగురుని సురేశుఁ డరసి చింతగొనక యి
ట్లను దేవ! యొక్కరును మె
చ్చని వార్తికరచన సేసి శ్రమపడు టేలా? 228.

శా. గార్హస్థ్యంబున నుండి కర్మకలనాగాఢాభిమానుండనై
యర్హత్వంబును గంట యెయ్యెడ నవద్యం బయ్యెనే? యేయతిన్
గర్హింపన్ గలనేని; సంన్యసనమున్ గైకొంచు బ్రహ్మైక్య మ
ర్థ్యర్థం బంచుఁ దలంపలేని కుహనావ్యాపారినే దేవరా! 2 9.

మ. శ్రుతి మర్మంబుల నెల్ల వార్త్తికములన్ జొప్పింప నాకేల వి
శ్రుత మావేలోకగ్రంథముల్ సలిపి మెచ్చన్ గాంచరాదో? యహం
కృతి మున్నే విడనాడి యీకృతికినై యేలా యహంకార? ము
ద్ధతపాటచ్చరవృత్తి కీర్తి ననుసంధానించునే చెప్పుమా. 230.

గీ. వేదమున లేమి సంన్యాస మాదరింప
రా దనుమతంబు నాది యన్వాదు నమ్మి
రాది మనవాదములఁ బూనినట్టి పశ్రిన
లెఱుఁగరో వీర లవి శ్రుతిహితము గావొ. 231.

ఉ. వీరలు భిక్షమాణు లయి వేశ్మముఁ జేరుటఁ గాంచి మత్ప్రతీ
హారులు వారణన్ సలిపి రంచు ననున్ యతిదూషకుండు గా
దూఱుట విందు; న ట్లయినఁ దోడన మీకెటు భిక్షకై నమ
స్కారము సేసి భిక్ష విధిసమ్మతమై తనరారఁ జేయుదున్? 232.

ఆ. జతుఁడ నౌట సంన్యసించితి నన మేలె
యాత్మతత్త్వ మెఱిఁగి యతివిరక్తి
సంన్యసింతు వాదసంరంభ మెన్నంగఁ
దత్త్వనిర్ణయంబు దలఁచి కాదె. 233.

మ. అవమానం బని యెంచఁ గాని ఝఁటు లధ్యాత్మజ్ఞ లౌవీర లి
ట్టివిధిన్ న న్నెద నమ్మకుండుటకుఁ గంటిన్ దాప మీనాఁడు సౌ
ష్ఠవ మొప్పన్ రచియించి వార్త్తికము భాష్యవ్యాప్తిఁ గావించు స
త్కవి యీపద్మపదుండె కావుత భవత్సంకల్పసంసిద్ధిగన్. 234.

క. అని కేలనున్నగ్రంథం
బును గురువరు పాదపద్మముల దాపున నుం
చెను దన విరచించిన ద
త్త్వనఘము నైష్కర్మ్యసిద్ధి యనునద్దానిన్. 235.

గీ. కాంచి చేకొంచు గురుఁడు నిష్కర్మతత్త్వ
విషయబోధపరిధానమై విపులయుక్తి
యగుచు నాద్యంతహృద్యపదానుగుంభ
మగుమహాగ్రంథ మరసె నాద్యంతముగను. 236.

క. అరసి ముదితాత్ముఁడై య
వ్వరకృతి శిష్యులకుఁ జూపె వారలకుం జే
కుఱెఁ బ్రీత్యయ మింతవిబుధు
నరయము దత్త్వజ్ఞ నన్య నని రేకముగాక్. 237.

సీ. ఇంతటివైరాగ్య మెటు దెల్పఁ గల్గె నీ
కర్మనిర్మగ్నుఁ డక్కజము గాఁగ
నాపూర్వపక్షమ్ము లరయ గుండియ లావు
లింప విపక్షు లెల్గింప కుండఁ బ్రి
యాకృతాంతచ్ఛాయ కడలి నోరెండి మూ
ర్ఛిల్లరే పరమతస్థిర మనీషు
లాయర్థయుక్తి భావాధిక్యము నెఱుంగ
వశ మానోకో బృహస్పతికి నేని
గీ యనుచు రచనాపటిష్ఠత యర్థగరిమ
భావగాంభీర్య మద్వైతభణితిఁ గాంచి
చిత్సుఖాదులు మదియందు సిగ్గుభయము
నచ్చెరువు నొంది గుసగుసలాడుకొనిరి. 238.

ఉ. అంత సురేశ్వరుం డనె మహాత్మ! 'యిదంకృతిపూరణార్థమం
దింత యశంబొ విత్తమొ యొకించుక గౌరవమో లభించు' నక్
స్వాంతమునక్ బ్రివర్తిలఁ, నిజంబు జగద్ధితకృత్య మంచుఁ జిం
తింతుఁ ద్వదాజ్ఞ మీఱి గణనీయుఁడ నౌదునె శిష్యకోటిలో. 239.

గీ. ఆక్రమింపదు బాల్యమ్ము యౌవనస్థు
యౌవనము వృద్ధుఁ జేరరా దటులె మున్ను
దవిలి గృహినైనఁ గలుగునే తత్స్వభావ
మరుగు నరుఁ డొందునే పూర్వమైన స్థితిని. 240.

సీ. పూర్వమీమాంసాప్రభుండు కుమారిల
భట్టదేశికు నంత్యవాంఛ యనియు
నటుమీఁదఁ ద్రిగజ దేశాచార్యుఁడవు పరి
శీలించి నన్ను శాసింతు వనియు
నుభయులశుశ్రూష నోలి మతద్వయిఁ
గల లక్ష్యముల సిద్ధిఁ గంటి ననియు
సన్న్యాసధర్మనిష్ణాతుండనై లోప
మొండు లేనటు చరియింతు ననియు

గీ. గురువుల ఋణంబు దీర్పఁ జేకుతెను సదవ
కాశ మనియును దలఁచి తల్లోకరచన
పూనుకొనునాకుఁ బ్రత్యూహాలు ఘటిల్లె
నకట! నాదైవసంకల్ప మట్టిదేమొ. 241.

గీ. నన్ను మాత్రమ గృహి నన జన్మె మున్ను
కానివా రెవ్వరయ్య మోక్షమును బంధ
మును మనంబె ఘటించుఁ గావున మనోవి
శుద్ధుఁ డౌనేని యగుఁత గేస్తుండొ యతియొ. 242.

గీ. మున్ను గృహినై మహార్థసంపన్నముగ ర
చింతునైయాయకాదివిశిష్టకృతుల
నిపుడు నామది భవదీయవిపులసేవఁ
దక్క నన్యంబు గావింపఁ దలఁపఁ బోదు. 243.

మ. ప్రకటోజ్జీవనగా నొనర్తు వట యర్వాచీనదుర్వాదిగ
ర్వకరాళానలకీలలం బడఁగ నద్వైతార్థబద్ధాదరా
త్మక విద్వద్వరబుద్ధి సంస్థితము శ్రీద్ధ వాక్సుధల్ జిల్కు; వే
నికి సాధ్యం బగునో యెఱుంగను నినుఁ సేవించి యప్పింగఁగ. 244

క. అని భాష్యమునకు గురునా
జ్ఞను గొంత రచించు వార్తికమును శపిం
చినగతి నపు డవ్వాలవై
చెను నిర్మముఁ డొచు నాసుశీలుం డంతన్. 245.

చ అది తిలకించి భిక్షుజనతాగ్రణి భాష్యముపైని వార్తికం
బొదవదె యక్కటా! యనుచు నల్లమునం దుదు కెత్తధీరుఁడై
యదియు వివేకనీరముల నార్పి, సురేశ్వరుఁ జేయఁ బంచె స
మ్మదమున వేదభాష్యములమర్మము దెల్పెడు వార్తికద్వయిన్.

వ. అట్లు చేయం బంచి. 242.

గీ. భావనిభమృదువాక్యసంపాదితార్థ
మాత్మపదఘాతపూర్వపతూనుగతము
యుక్తిసాధిత సిద్ధాంతయుతము తత్ప
దము కృతిని గాంచి మెచ్చి మోదమున ననియె 248.

సీ. వినయైకధన! నీ వనినదె సత్యం బగు
యాజుషశాఖ నాయది, తదంత
గతభాష్యమనిన నా కతిముదం బగుఁ గానఁ
దద్వార్తికము మదర్థము రచింపు
మఱి కాణ్వశాఖ. నీయది– తదంతగతాస్మ
దీయభాష్యమునకుం జేయు వృత్తి

సన్మార్గగాము లౌజనుల వర్తన మెన్నఁ
బరహితాచరణైకఫలము సూవె

గీ. యార్తిహారిగ నారెంట వార్తికమ్ము
సలిపి కార్తికచంద్రికాసదృశకీర్తిఁ
దనరుమా దుశ్శ్లోక్తిరోధంబు తొంటి
యట్లు కలుగదు నామాట నండఁ గొనుము. 249.

మ. అని శ్రీశంకరపూజ్యపాదుఁ డనఁగా నవ్విశ్వరూపుండు స
ద్వనచైత్రుండు రచించె నాగమశిరోభాష్యద్వయీవార్తికం
బును, గుర్వాజ్ఞ యలంఘనీయ మని, సంపూరించి గ్రంథ మ్మువా
యనముం బట్టెను దేశికాగ్రణికి సీమాతీత మహాభక్తితోఁ. 250.

గీ. వర్ణణించె సనందనుం డొక్కటీక
భాష్యమున కొజ్జ యానతి వడసి, మదియుఁ
బంచపాదిక యనఁ బూర్వభాగ మమర
వృత్తియన నుత్తరార్ధ మింపెనయఁ దనరె. 251.

ఉ ఆరసి వ్యాససూత్రనివహార్థవివేచనముఁ స్వకీర్తి డిం
డీరసమృద్ధికిఁ విజయడిండిమనామక మైన వ్యాఖ్య గం
భీరతరోక్తి యుక్తి పరిమృష్టముగా విరచించి యొజ్జ కం
భోరుహపాదుఁ డిచ్చెను బ్రమోదము మీఱ నుపాయనంబుగాఁ.

క. తదనంతరమ్ము గురుఁడును
మది గ్రహాసంచార మెంచి మంతనమునఁ దఁ
గదిసిన సురేశ్వరున కనె
సదయాంతఃకరణుఁ డగుచు సాంత్వనఫణితిఁ 253.

సీ. ప్రారీప్సితగ్రంథ మంతరాయము గాంచు
మంగళాచరణసామర్థ్య మెడయ
నామంగళంబు ననంతజన్మాచరి
తంబై యిదానీంతనంబుఁ బోచు
నెవ్వాఁడు బహుజన్మకృతమంగళుఁడొ వాఁడు
సంసిద్ధిఁ గను నేఁడు సలుపకున్న
నద్యతనప్రాక్తనానందమంగళుం
డయ్యు సజ్జను లన్న రనినఁ జెడును.
గీ. నీకృతికి నేఁడు విఘ్నము సోఁకు టెన్నఁ
జాల దనుకొందు మంగళాచరణబలము
ఉల్లమున నున్న రనుచు నీ వుపతపింప
నెటు సనందనుఁ డింక గ్రంథకర్త కలఁడొ. 254.

వ. అని యించుకతడవు కన్నులు మూసి ధ్యానించి నిట్టూర్పు పుచ్చి యిట్లను. 255.

గీ. ఈసనందనకృతటీక నేనుపాద
ములె వెలయు, సూత్రయుగము యాదుల రహించు
నీవు ప్రారబ్ధవశమున దేవగురుఁడ
వై ప్రొదమి చేయుదువు భాష్యమందుఁ డీక. 256.

శా. ఆకల్పం బలరారుఁగాక భవదీయం బంచు దీవించి భి
క్షాకాధీశుఁడు తోటకాదుల మహాగ్రంథమ్ము లద్వైత దీ
క్షాకంబుల్ విరచింపఁ బన్పెఁగ ననేకగ్రంథముల్ బ్రహ్మ వి
ద్యాకల్పంబులుగా రచించి రల విద్యార్థుల్ యథాశక్తిగన్. 257.

ఆశ్వాసాంతము.

శా. కస్తూరీహిమవాలుకాఘుసృణసౌగంధ్యాప్తసీతాస్వయం
హస్తప్రాపితవీటికారసన జాతానందవీప్స్వాయుతా
ధస్తాధూర్ధ్వగసారవాబ్జమధుగంధగ్రాసమందానిలో
పాస్తిప్రస్ఫుటమోదకారణదయోధ్యాసౌధమధ్యస్థితీ. 258.

క. నిధ్యానమాత్రపావిత
మధ్యేటవివ ర్త్రిశబరమహిళా! మహిచ
కాద్యక్షా! వేంకటరా
యాధ్యాత్మారామ! జనకజాత్మాధీశా! 259.

స్వాగతము. శర్వరీట్ప్రకలసన్నిభగండా!
యుర్వరోరుభరయుగ్భుజదండా!
శర్వచాపబలచండిమఖండా!
గర్వితాహితవిఖండనచండా! 260.

ఇది శ్రీగురుకరుణాసమాసాదిత కవిత్వ 'విద్వత్కవిశేఖర,
కవితాభూషణ' వెంపరాల సూర్యనారాయణనామ
ధేయప్రణీతంబైన శంకరవిజయంబున

షష్ఠాశ్వాసము.



# శ్రీ శంకర విజయము

## సప్తమాశ్వాసము.

శ్రీమత్కౌసల్యాగ
ర్భాబులశుక్త్యుదితమౌక్తికా! వేంకటరా
యామాత్యజప్యనామ! ని
రామిషతాపసమనోభిరామా! రామా!

వ. దేవా! అవధరింపుము

ఆ. అవుల నొక్కదినమునందుఁ బద్మపదుఁడు
తీర్థయాత్ర సేయుదివుట నొంది
యభ్యనుజ్ఞ వేఁడ నాచార్యుఁ డీరీతి
ననియె యాత్ర మాన్ప నాశయమున. 1.

సీ. సత్క్షేత్రవాన మొజ్జలచెంత నుంటయు,
యనఘతీర్థము తదీయాంఘ్రిజలమ
తదుపదేశకృతాత్మదర్శనం బఖిలదై
వతదర్శనమ్ము తద్వాక్కు ఋక్కు
శుశ్రూషమాణశిష్యున కొజ్జచెంతఁ జౌ
ర్యము గూడ దితరత్ర యరుగఁ గూడ
దమితమార్గాయాస మందరా, దందిన
నిద్రచే స్వాధ్యాననిష్ఠ చెడును

గీ. సన్న్యసనము విద్వత్సన్న్యసన మటంచు
వివిదిషాసన్న్యసన మంచు ద్వివిధ, ముభయ
మందుఁ దత్త్వంపదార్థైక్య మాప్య మగుట
గమ్యము త్వమర్థమే కాని కా దితరము. 1.

క. అలవడు నొకచో సలిలము
లలవడ వొకచోట; నొకట నమరును శయ్యా
స్థల, మొకట నమర, దిటు వాః
స్థలలిప్సం బథికుఁ డేమి సౌఖ్యము నడయుఁ. 2.

గీ. జ్వర మతీసార మాదియౌ వ్యాధు లలమ
నేయుపాయంబు గానరా కేఁగుటకును
నాఁగుటకు సాధ్యపడ కల్లలాడుఁ బాంథుఁ
డట్టితఱిఁ బాసి చనును సహాయుఁడేని. 4.

ఆ. అర్ధ్వగునకు నబ్బ వహారాది స్నానశౌ
చాదికము సమాధు లమరపూజ;
లొదవ రాప్తమిత్రు, లదన నన్నము గాదు
మొగము వాఁచు శాకమునకుఁ గూడ. 5.

చ. అనుటయు శిష్యుఁ డి ట్లను మహాత్మ! భవత్కథితంబు కాదనం
జనునె గురూపకంఠమున సంస్థితిఁ గల్గుసుఖంబు గల్గ దెం
దు నయిన దేశపర్యటనదుస్త్యజవాంఛ బలాత్కరించుచుం
డెను బరదేశయాత్రల గణింతునె కష్టము లెవ్వి కొత్తలే? 6.

గీ. అష్టకష్టమ్ములందు హెచ్చైనకష్ట
మరయఁ బరదేశయాత్ర గృహస్థతతికి
నేఁ బరివ్రాజకుఁడనయ్యు నెమ్మనమునఁ
దలఁతునే ద్వంద్వజన్యబాధాలవంబు. 7.

గీ. ఆత్మ కంటవు కష్టసుఖాదికమ్ము
కలుగుఁ గర్మానుసారము కాయమునకుఁ
గర్మమో కాలపరిపాటిఁ గలుగుఁ గాల
గతికి దేశవిభేదమ్ము గలుగ దండ్రు. 8.

ఉ కావునఁ బో ననుజ్ఞ నొసఁగన్ మిముఁ గోరెదఁ బ్రేమతోడిమీ
దీవన నాకుఁ దోడయి విదేశమునన్ దొలఁగించుఁ గ్లేశముల్
కావలె నన్న దుర్ఘటసుఖంబులనేని ఘటించు ధర్మదీ
క్షావిహితక్రియావనవిచక్షణమై ననుఁ జేయు ధన్యునిన్. 9.

క. అనుచు గురూక్తనిషేధము
లను బ్రతివచనములచే మలంపఁగ గురుఁడున్
మనమున నలరుచు ననె నీ
మనసుదృఢిమ మరయఁ దత్క్రమమున నుడివితిన్. 10.

ఆ. పిన్నవయసువాఁడ వెన్నియో వేత లబ్బు
నొంటిగా భ్రమించుచుండువేళ
నమ్మరాదు జనుల నమ్మకపోవరా
దన్యదేశగామి యగునరుండు. 11.

సీ విహితకృత్యమ్ము లన్వహము పాల్యము లవి
స్మర్తవ్య మధ్యాత్మతత్త్వచింత
విదితసంవిదుల సౌహృదము సంపాద్యము
శ్రోతవ్య మాప్తోక్త్యనాధరీతి
యనఘచరిత్రులౌ యతు లభిగమ్యులు
సహ్యమ్ము దైహికశ్రాంతిభార
మాపద్రహితపదం బాశ్రయణీయ, ము
త్సర్జనీయమ్ము మితంపచాళి
గీ విమతు లమతులు కుమతులు వెలయుచోట్లు
త్యాజ్యములు సూవె యేవేళలందు నీకు
వితత మొనరించు చద్వైతమతము జగతి
వివిధపుణ్యస్థలములు సేవించి రమ్ము. 12.

క. అను గురుసివాగమృతఝర
మును గోల్రి ప్రహృష్టహృదయమునఁ జనె దేశా
టనమునకుఁ బద్మపాదుఁడు
చనె గురుఁడును శృంగగిరికి సహశిష్యుండై. 18.

చ. అవట సురేశ్వరాదిమహితాత్ములు శిష్యులు గొల్వ శారదా
పచితివిలగ్నచిత్తుఁ డయి భాసిలుచుండఁగ నొక్కనాఁడు మా
తృచరణసేవ లేవడి స్మృతిం దవులన్ ఋణ మీఁగియున్ ఋణో
పచయమునందు బద్ధుఁ డగుభాతిఁ గలంగి యనున్ స్వశిష్యులన్.

శంకరుఁడు తల్లిసమీపమునకు యోగశక్తి నరుగుట.

మ. అది యేమో పరదేవతార్చనము సేయన్ నేఁడు గూర్చుండ న
మ్మది చే వెట్టి కలంచిన ట్లయిన; దస్మన్మాత ప్రాణావసా
నదశన్ నన్ను స్మరింపఁ బోలు వెస జ్ఞానప్రక్రియన్ ముక్తిసం
పద చేకూర్పఁగఁ బోదుఁ గావవలదే ప్రాగ్దత్తవాగ్దానమున్. 15.

ఆ. సన్న్యసించుతఱిని జనయిత్రి వేఁడ బ్రా
ణావసానకాలమందు వచ్చి
నినుఁ దరింపఁజేయుదు నటంటిఁ దఱి యైన
యటుల యోగశక్తి నది స్ఫురించె.

క. అని యవలంబితగగనా
యనుఁడై క్షణమంద జననియంతికమునకున్
జని యె నసాధ్య మ్మని క
ల్గనె యెయ్యెడ యోగసాధకున కెన్నంగన్. 17.

క. చని యాతుర యగుమాతను
గని తత్పదములకు మ్రొక్కఁ గాంచి, జలదమున్

గను ఘర్మతప్తుఁ డటు ల
వ్వనిత తనూతాప మపుడ వాయఁగఁ దట్టెన్. 18.

గీ. తా నసంగుండ యయ్యుఁ జిత్తమునఁ గరఁగి
యమితమోహాంధతమసాపహర్త యతఁడు
తల్లి యిదె వచ్చినాఁడ సంతాప ముడుగు
నిపుడ యొడఁగూర్తు నీకోర్కె యేమి యనుచు. 19.

క. చిరమున కనామయుని సుతు
నరయుట హర్షించి మంద మగు స్వరమున ని
త్రటి భాగ్యమ్మునఁ గుశలిని
నరసితి నిను నింతకంటె నభిమత మున్నే. 20.

ఆ. నేఁడు వేగుఁబోక నిన్నుఁ దలంచితిఁ
బ్రాణ మింక దేహమందు నిలువ
దనుభయంబు నూని యన్న యెచ్చో నున్న
వాఁడొ యెపుడు వచ్చువాఁడొ యనుచు. 21.

ఉ. పుత్త్ర! జరాతిశీర్ణ మగు మూర్తి భరింపఁగఁజాల, దీనికిన్
బాత్త్రతఁ గల్గ శాస్త్రవిధిపద్ధతి సంస్కృతి సేసి భవ్యచా
రిత్త్రక! పుణ్యలోకచిరవృత్తి నొసంగఁ గదన్న! యన్నఁ దా
పత్త్రయవారకుం డతఁ డభంగవిమోక్ష మొసంగు భావనన్. 22.

శంకరుఁడు తల్లికిఁ దత్త్వోపదేశము సేయుట.

చ. అమితము, నద్వితీయము, మహాసుఖరూప, మపాస్తమాయ, మ
చ్ఛమహిమ, మప్రమేయమును స్వప్రభమున్ విగతామయంబు జ
న్మమృతిజరాదిదూరము సనాతన మా పరమాత్మతత్త్వ మా
యమ కుపదేశమిచ్చె సనకాదివినుత్యుఁ డతండు భక్తిమై. 23.

గీ. అపుడు జనయిత్రి యను సౌమ్య! యగుణ మాత్మ
నాకు రుచియింప దిఁక సగుణమ్ము రమ్య
మైన దైవతమును దెల్పు మకట! బుద్ధి
కంద దేక మనాకార మగుపరాత్మ. 24.

ఆ. అనుచుఁ దల్లి యన దయాళుఁ డాయతి భుజం
గప్రయాతవృత్తకవనరీతి
భక్తి శివు నుతింప భవుఁడు ప్రసన్నుఁడై
యనిపె నాత్మదూతలను దురితంబ. 24.

ఉ. శూలపినాకపాణు లగుచున్ జనుదెంచిన ఫాలనేత్రుదూ
తాళిని గన్నులారఁ గని యాయమ వీరలవెంటఁ బోవఁగాఁ
జాల నటంచుఁ బల్కుటయు శాంకరదూతలఁ బోవ వేఁడి స
చ్ఛీలుఁడు శంకరుండు వినుతించె రమాధవు నాదరంబునన్. 25.

వ. అంత.

సీ. కమలామృదూరుభాగప్రసారితపాద
సరసీజయుగళు నాజానుబాహు
నీళామహీకరాలోలచామరవీజి
తుని వినతాసుతస్తూయమాను
దేహభృదస్త్రాధిదేవతాపంచకా
ర్చితుఁ దమాలాసితద్యుతిశరీరు
నుదయదుష్ణమయూఖసదృశరత్నకిరీటు
నుత్ఫుల్లపుండరీకోపమాక్షు

గీ. భుజగరాజన్యభోగతల్పుని ముకుందు
సుతుఁడు వినుతింప నారూపె మతి ధరించి
పరమయోగీంద్రుఁ డరణి సంసరణ మెడయఁ
దన్మయత నొంది యార్యాంబ తనువు దొఱఁగె. 27.

చ. అంత శరత్కలానిధికరామలదీప్తి చలద్ధ్వజాఢ్యముల్
గాంతము నౌవిమానమును గైకొని వచ్చిన విష్ణుదూతలన్
శాంతమనోజ్ఞ వేషులఁ బ్రసన్నులఁ గాంచి సుతుల్ నుతించున
క్లాంత విమానమం దునిచి గ్రక్కునఁ దోడ్కొని వార లేగుచో.

గీ. అర్చి, రహ, రాద్యపక్షమ్ము లతకరించి
నుత్తరాయణ మబ్దమ్ము లుత్తరించి
పవన రవి విధు తటి దబ్ధిప హరి విధిజ
గంబులను దాఁటి పరమపదంబు చేరె. 29.

శంకరుఁడు స్వయముగఁ దల్లికి నుత్తరక్రియలు నెఱవేర్చుట.

ఉ. ఆమెడ గేహముల్ పొలము లర్థములున్ దన వెల్ల గొన్నగో
త్రీయులఁ బిల్చి యాయమ మృతిం గనె నుత్తరకర్మ మీరు శా
స్త్రీయముగా నొనర్పుఁ డనఁ జెంతను బుత్రుఁడ వుండి మమ్ములన్
జేయుఁ డటందు వేల తగునే యిటు పల్కఁగ నీకు శంకరా. 30.

గీ. నీయభావమ్మునం దేమి చేయువార
మాత్మజుఁడు చెంత నుండియు నౌర్ధ్వదైహి
కక్రియలు తల్లి కొనరింప జ్ఞాతిజనుల
కిటు నియోగించు టాలింప నెచట నెపుడు. 31.

చ. అనుటయు సంయమీంద్రుఁడనునక్కటయిఁతటిమాధ్య మెందునుం
డునె చరమాశ్రమస్థితు ననున్ గృహిధర్మముఁ బూను మందురే
జనని యటంచు వచ్చితినె చక్క వినుండు ముముక్షు వీమె, కా
వునఁ దదభీష్టమున్ నెఱపుపూన్కి న వత్తు నొనర్తు నిష్టమున్. 32.

క. పూర్వాశ్రమసంబంధము
సర్వము తెగె నాకు, మీరు జ్ఞాతుల రేత

త్సర్వస్వ మనుభవించుచు
గర్వంబున శాస్త్రపథము కాదనఁ దగునే. 33.

మ. మమతన్ నే నరుదెంచినాఁడ ననుచున్ భావింపఁ బాపంబు ని
ర్మమతన్ గర్మము లుజ్జగించి శ్రుతిధర్మం బోముచున్ జ్ఞానవ
ర్త్మమునన్ సంసృతిభీతు లౌజనుల సంరక్షింప నీక్షించుస
త్క్రియులన్ సంయములన్ గృహస్థునటుపల్కన్ నాల్కయెట్లాడెనో.

శా. ధర్మాధర్మవివేచనన్ మఱచి యర్థంబే ప్రధానంబుగా
దుర్మోహంబున బ్రుంగి శాస్త్రవిధులన్ ద్రోపాడి పాపంబునన్
నిర్మగ్నాత్ములు గాఁదలంతురె? విధానిష్ణాతు లౌపెద్ద లీ
మర్మంబున్ వివరింత్రు పోయి యడుగన్ భావ్యంబు మీకెయ్యెడన్.

ఆ. గురువు నౌదుఁ గాని కొమరుండఁ గా నీవె
కేను సంన్యసించి యేఁగి యుంట
నిదిగొ చనుచు నుంటి నీకర్మలోపంబు
పఱచు మిమ్ముఁ గంతపాశ మగుచు. 36.

సీ. ధృతి సర్వసంగపరిత్యాగినై యేఁగు
నా కింతకలుషంబు సోఁకఁ బోదు
నను సంన్యసించుపుత్రుని గన్నయీామె కే
కర్మలోపములు మోక్షమ్ము చెఱుప
వీకర్మలోపంబు మీకులంబులు తర
తరములు చెఱుపక సురిఁగిపోవ
దర్థాశ విహితకర్మానుష్ఠితిఁ దొఱంగు
ఖలులఁ బూతుల శ్రుతుల్ సలుపలేవు
గీ. శాస్త్ర మాచారముఁ దలంచి సత్పథమునఁ
బొందు పోకున్నఁ గులహాని పుట్టెటీయుఁ

గేరళమున కకీర్తి చేకూఱు ఘోర
మరణముఁడీ తప్పుత్రోవను మరలుఁ డీకు. 37.

క. అని ధర్మము లెంతగఁ జె
ప్పిన జ్ఞాతిచయంబు పెడచెవిని బెట్టిరె కా
ని నిదానింపర యతిపతి
పను పౌనరింపకయు యిట్లు పలికిరి పెలుచన్. 38.

సీ. పితృకర్మ మొనరింపఁ బిఱితివిసిరె మునీ
శ్వరులు వారికి లేవె శాస్త్రవిధులు
యతి నంటి వపులఁ బ్రాయశ్చిత్త మొనరించు
కొనఁదగు నిది తోఁసి చనఁగఁ దగద
యాత్మజుం డెట్టివాఁ డౌఁగాక పితృపార
లౌకికవిధులు సల్పంగఁ గర్త
తదభావమునఁ గాక దరి కేఁగ నన్యుల
కధికార మిసుమంత యైన సున్న
గీ. విహితకర్మము మానుసీవిధమున నవి
హిత మొనర్చినమేము నిష్కృతివిరహిత
మైనప్రత్యవాయమ్మున కగ్గ మాదు
మీఁదు నందును గతులు లేకుండు మకట. 39.

ఆ ఇది గృహస్థకృత్య,మే మన్నయ ట్లీవు
సేయవలయు నొండు సెప్పఁదగదు
కా దటందువేనిఁ బోదుము నీయిచ్చఁ
జేసికొనుము మాకుఁ జెప్ప కనుడు. 40.

క. ఆపలుకులకుం గనలుచు
నీపై శ్రుతికర్మబాహ్యు లీ రయ్యెద రం

చాపాపచరితులకు యతి
శాపమొసఁగ యతిని దిట్టి చని రెటకేనిఁ. 41.

క. అది ధర్మ మిది యధర్మం
బది కార్య మ్మిది యకార్య మని తోఁపద దు
ర్మదులమదికి భగవంతుం
డెదురఁ బడి నిజమ్ము దెలుపనీ యెటు గానీ. 42.

శా. శాపం బిచ్చి యతీంద్రుఁ డాత్మజననీసంతారకుం డయ్యె సం
తాపం బందుచు 'వీని పోఁ దగ దనాథప్రేతసంస్కారరూ
పాపద్ధర్మ మి'దంచు మాతృశవదాహార్థంబు వైశ్వానరం
బాపల్లెం గలవారి వేడ, నిడరై రాపుల్కప మ్మెవ్వరుఁ. 43

ఉ. తా నఖిలజ్ఞుఁడై యగుత ధర్మము సెప్పుమమ్ముఁ శపించి య
ద్దానికె సిద్ధ మయ్యెనె యధర్మము గాదొకొ తా నొనర్ప, వై
శ్వానర మిం డటంచు మను శప్తుల నేఁ డెటు వేఁడ వచ్చె? ని
ప్పైన నొసంగ మారసెద మాశవ మొక్కఁ డెటుల్ దహించునో.

క. అనువార కాని యచటికిఁ
జనువా రనలమ్ము నొసఁగి సాయపడఁ దలం
చినవారు లెక్క కొకరును
గనరా రతిచిత్రి మూరఁ గలయెవ్వారుఁ. 45.

మ. అటు లింటింటికిఁ బోయి ని ప్పడిగి వ్యర్థాయాసుఁడై శంకరుం
డట నున్నట్టి నిజాన్వవాయులయకృత్యం బెంచి కోపించి యం
తటఁ దన్మాతృపసవ్యదోర్మథనముఁ గావించి దీప్రాగ్ని న
ప్పటఁ బుట్టించి దహించెఁ దత్కుణపముఁ వాసోపకంఠస్థలిఁ.46

క. దహియించి యాదురాత్ముల
బహుళాహంకారపంకపటల మిగుర న

మ్మహితుఁడు వా రందఱు శ్రుతి
బహిష్కృతులుగా శపించి వదలక వారిన్. 47.

ఆ. 'యతులు మీగృహమ్ములందు భిక్ష యొనర్ప
రిఁక గృహోపకంఠమే స్మశాన
మగును మీ' కటంచు నతిఘోరశాపమ్ము
నిడియె నీట నగ్ని వోడమినట్లు.

క. అదిమొదలు లాదేశస్థులు
చదువరు శ్రుతి యతులు భిక్ష సలుపర తదే
హ్యాదవసితముల, స్మశానము
సదనాంతికభువియె గాఁగ జరుగును నేడున్. 49.

చ. అకట మహానుభావులయెడాటమునన్ బచరించుబుద్ధిపూ
ర్వక మపరాధ మేరికి శుభంబు ఘటించును? శాంతుఁ డంచు మి
న్నక సుజనున్ వ్యథాకులు నొనర్పఁ బ్రమాదము; చందనద్రుశా
ఖక యని రాపువెట్టఁ బటుకీలలతో ననలంబు పుట్టదే? 50.

మ. తిలకింపన్ యతిమౌళి చేసిన దశాస్త్రీయంబుగా నున్నఁ గే
వలధర్మావనబుద్ధిఁ జేయుటను నాపద్ధర్మ మాఁ దాదృశో
జ్జ్వల తేజస్కులు దూల్చి వైచెద రవశ్యంభావ్యధర్మక్రియా
కలనాయాతము ప్రత్యవాయముఁ దపోగాఢప్రభావంబునన్. 51.

గీ. అద్ది ధర్మవ్యతిక్రమంబట్ల తోఁచు
నరయ సాహస మా నది యైన నమ్మ
హాత్మ లొనరించి రని యన్యు లాచరింప
రాదు మోస మా నవరిదౌర్బల్యమునను. 52.

క, లోకావనార్థజన్ముల
లోకాతీతప్రవృత్తి లోకుల కెపుడున్

స్వీకార్యము కా; దిఁకఁద
ద్వాకులె గాృహ్యామ్ము లంచు వాకొనును స్మృతుల్. 53.

చ ఇటు జననిన్ మునీంద్రసమభీప్సితమున్ వితమస్కమున్ సుఖో
త్కటముఁ బునర్జనుర్విరహితం బగుసద్గతిఁ జేర్చి యాతఁ డం
తట ధరఁ బాదుకొన్నవిమతంబు లడంపఁగ దీక్షఁబూని ప
ర్యటనవిలంబమున్ సలిపె నబ్జపదాగమనంబు గోరుచున్. 54.

పద్మపాదుఁడు దక్షిణదిగ్యాత్ర నొనర్చుట.

ఆ. మున్ను గురుననుజ్ఞఁ జన్నట్టియప్పద్మ
పదుఁ డుదీచ్యతీర్థపటలిఁ గొల్చి
చనె నవాచి దిశకు సకలామయఘ్నకు
సెందుఁ గలశజన్ముఁ డేపుడు నుండు. 55.

చ. కన సుభగోరగాభరణకమ్రతనున్ బృథులింగసన్నిధా
నుని గరుణారసాప్లుతమనోయుత యానుముఁ గూడి మాళిఁ జం
దృనికళఁ దాల్చి సమ్మదఘనుం డగువానిని గాళహస్తినా
థుని సురపాదిదైవతనుతున్ శివు నయ్యతి గాఢభక్తిమై. 56.

శా. స్నానం బాడి యతండు కాంచనముఖీస్వచ్ఛాంబుపూరంబునం
ద్యానంత్యంబున భావపుష్పనికరం బర్పించి యగ్గించె వా
క్ఛ్రీనృత్యమ్మన భక్తిపూర ముబుకన్ శ్రీకాళహస్తీశ్వరున్
జ్ఞానానందమయప్రదీపకళికన్ జ్ఞానప్రసూనాంబికన్.

గీ. కాళహస్తిశుననుమతిఁ గాంచి, కాంచి
కరిగెను బవిత్ర మగుక్షేత్ర మగుటఁ దెలిసి
భవమహోగ్రధిసంతితీర్షువుల కదియు
తరణసాధన మనుచుఁ బెద్దలు వచింత్రు. 58.

గీ. ఆత్మభాగ్యాతిశీతిచే నచటివిశ్వ
పతిని నేకామ్రనాథుని నతులఁ గొలిచి
యంతకాంతకుఁ డగురుద్రుహార్ద మరయ
నన గృహాంతర్గత యగు కామాక్షిఁ దెలిచె. 59.

వ. మఱియు నాతిదూరమున నలరారుపురాణపురుషుఁ గరుణారసస్నిగ్ధ స్వాంతు ననాదిమధ్యాంతు లక్ష్మీకాంతుఁ గల్లాలేశుఁ గాంచి నుతించి, యచట గదలి శుచిస్మితవదనమునఁ బార్వతీరూపపరిణత యగునాదిమప్రకృతికిమాత్రము గోచరింప సదా నృత్యము సలుపు సదాశివునివాస మగుపుండరీకపురమున కరిగి, నిర్మలస్వాంతంబును దివ్యచక్షువునై మునిజనంబు తన తాండవము చూచి జన్మమృత్యుజరాభయ మపనయించి తరింప నేతమనోవినోదకారకుం డగు పరమేశ్వరు భజించి శివభక్తులం గని తత్తీర్థమహాత్మ్య నడుగ నందొకఁ డిట్లు తద్వృత్తము నెఱిఁగించె. 60.

ఉ. భక్తుల కోర్కి మై శివుఁడు భావమునన్ స్మరియింప గంగ యూ
సక్తిని జెంతఁ బాఱుటఁ బ్రజల్ శివగంగ యనంగఁ దీర్థమై
ముక్తి శివాజ్ఞచే నొసఁగు మున్గినమాత్ర నఘంబు వాసి స
ద్భక్తులు గాంతు రీశ్వరునితాండవ మందురు కొంద ఱుత్తముల్.

క. కొందఱు నాట్యంబున శ్రమ
మందిన శివుఁ దేర్ప శివయె యనురాపగ రూ
పొంది ప్రవహించుటన యిది
పొందెను 'శివగంగ' నామము నటం డ్రెలమిన్. 62.

చ. నటదభవోత్తమాంగక పినద్ధచలాచలజాటజూటసం
పుటగళితాభ్రగాంగజలముల్ ప్రణటత్తటరుద్ధనిర్ఝరీ
త్రుటితపతత్కణంబు లయి తోడన పార్శ్వమునుండి జాఱి పా
ఱుట శివగంగ నాఁగఁ దనరున్ దదభిఖ్య యటండ్రు పండితుల్.

చ. అనితరసాధ్యభక్తివివశాత్మకుఁడై నరుఁడేఁగి గంగలో
మునుకలు వెట్టిపెట్టి మఱి పుంగవకేతుపాదపద్మముల్
కనుఁగొని ముట్టిముట్టి హృదిఁ గ్రిన్నన శోధన చేసిచేసి తా
ననవరతంబు గాంచుఁగదా డంగజసంహరుదివ్యధామ్యముల్. 64.

క. శివగంగ మునింగి యుమా
ధవునిఁ గనుఁగొన్న నరుఁడు దారసుకృతనై
భవము వివరింప దక్షుఁడు
భవుఁ డొక్కఁడ గుదుగాక పరు లగ్వా లోకా! 65.

గీ. అన విని పయోజపదుఁడు జితాత్ముఁ డభవ
యోజితాత్ముఁడై సమ్మదం బూని తీర్థ
మందు మజ్జన మొనరించి యఖిలలోక
భర్త యగుశంభుపదములవార్కిలి మ్రొక్కి. 66.

ఆ. అచటు వాసి దశరథాత్మజకృతసేతు
దర్శనార్థ మరుఁగఁ దలఁచి యయ్యు
నుత్తముఁడు మునీంద్రుఁ డొయ్యనఁ జనువాఁడు
సరణిఁ గనెఁ గవేరజాప్రవంతి. 67.

క. శ్రీగోదవాసగసిఖుఁడు
వారిజనాభాదినామవర్ణితుఁ డగునా
హైరణ్యచేలునకుఁ గా
వేరిపులినసీమ నుంట వేడ్కయఁట మదిన్. 69.

గీ సహ్యపర్వతికన్యాప్రసన్నతరప
యోభిషిక్తముల్ భగవత్పదాబ్జములు ద
లంచి బహుశిష్యగణము సేవించుచుండ
వెడలె నభిరుచిత్తస్థలి వేగఁ జేర. 69.

పద్మపాదుఁడు మేనమామ యిల్లు సేరుట.

క. పోవుచు మధ్యేమార్గ
మ్మావిమలుఁడు మాతులునిగృహమునకు బహుశి
ష్యావృతుఁడై చేరుటకు సు
ధీవరుఁ డగుమేనమామ దేలె ముదబ్ధిన్. 70.

వ. అంత నయ్యెడ నున్నసుహృద్బంధుగణంబు లప్పద్మపాదుఁ జూచి గుములుగట్టి యొక్కపటి వచ్చిరి. 71.

ఉ. వచ్చినవారిలో నొకఁ డవారితసమ్మదబాష్పవయ్యె, వా
విచ్చి యొకండు గోడ్వాడె, సవేలముదం బొకఁ డందె, నొక్కఁ డ
త్యుచ్చముగా హసించెఁ, బ్రమదోన్నతి నొక్కఁడు పొక్చరిత్రి వా
కుచ్చె మితోక్తి మొక్కె నొకరుం డనుడుల్ దిగమ్రింగి వైచుచున్.

చ. ప్రమదము మీఱ వానిఁ గని బాంధవు లిట్టని రార్య! యెంత కా
లమునకుఁ గాన వచ్చి? తఖిలం బగుబంధుత హార్దపూర్ణచి
త్తములను గోరు నీదుశుభదర్శనభాగ్యము నొంద, నేమి పా
పమొ యొకమాఱునేనిఁ గనుపట్టవు చుట్టఱికంబు వోయెనే. 78.

క. కలుగరు సుతులు సఖులు బం
ధులు యతికిన్ రాజబాధ లోఁప దెపుడు చో
రులవలసిభీతి పొడమదు
తలఁప యతితత్వము కృతార్థతామూలము సూ. 74.

గీ. సుమఫలాభ్యంచితంబుఁ బ్రోంశువు సశాఖ
కోపశాఖాక మగుశాఖ నుర్విజనులు
పీడ వెట్టెడుగతి ధనాన్వితు దరిద్రు
లండఁ జేరి పీడించెద రనుదినంబు. 75.

గీ. రాదు నిద్దుర, లేదు శర్మము కుటుంబ
రక్షణవిలుప్తచిత్తు లౌపరిజల కింక
దేవతాభ్యర్చనం బేడ? దీర్థయాత్ర
యేడ? సర్వాన్నిషేవణం బేడఁ దలఁప. 76.

ఆ. నీవు సన్న్యసించునావార్త వింటిమి
తెలుప నొక్కవిప్రకులుఁడు తొల్లి
యొంతకాల మైన నీవు రా విపుడు తీ
ర్థముల కనుచు వత్తు దైవవశత. 76.

సీ. సౌఖ్యమ్ము నొసఁగునవృక్షముల సమాశ్రయిం
చియు వాసివిడుచువిహంగములట్ల
పరకృప్తమఠసుగావసథమ్ము లాశ్రయిం
చియు యతి వానిఁ ద్యజించి యేఁగు
సుమములవ్రాలి సారము సంగ్రహించి భృం
గములు తద్రస మానుకరణి వెలయ
నిల్లిల్లు దిరిగి యోయిరము భిక్షించి త
త్సార మాని తపస్వి సౌఖ్య మొందు
గీ. ఘనవిరాగోదితాత్మావగతియ భార్య
తనువె భవనంబు మఱి సంయతంబె సుఖము
ధృతవిరాగులు శిష్యులే సుతులు గాఁగ
నలరుయతులకు నర్థనీయంబు గలదె. 78.

ఉ. దారపరిగ్రహార్థము సదా మనుజుం డొనరించి యత్నముల్
దార లభింపఁ బుత్త్రులఁ గనన్ మదిఁ గోరెడి, నిట్లు కోర్కులన్
సారెకుఁ బర్వులెత్తి కనఁజాలఁ డొకింత ఫలంబు ధాత్రిఁ జే
కూరునొకో సమాప్తి యని కోర్కుల కారయ నెన్నఁడేనియున్.79.

గీ. కోరుకొన్నట్టికోర్కి చేకూరదేని
యమితదుఃఖంబు గను నరుం డభిలషితము
తొలఁగ నేరఁడు కామతత్పరున కెందు
వెతలె కాన ధరింప నౌ మతి విరక్తి. 80.

ఆ. అనఘ! చిత్తశుద్ధి యగు మూలము విరక్తి
కదియ మూల మగు మహాన్నిషేవ
కందుర్ కానఁ దిరుగుచుందుర్ భవాదృశు
లుర్వి నల్దిశలఁ బరోపకృతిగ. 81.

క. అజ్ఞాతగోత్రులై బ్ర
హ్మజ్ఞానుల యయ్యు జడులయటు కనఁబడుచున్
బ్రాజ్ఞులు ప్రాణ్యనుకంపా
భిజ్ఞులయి చరింతుర్ విషయవిముఖత వెలయన్. 82.

క. చరియింతుర్ లోకసంగ్రహ
పరులై తీర్థములు శుద్ధభావులు మహితుల్
దురితవిదూరులు వారలు
కరమున సోఁకిన జలంబె ఘనతీర్థంబౌ. 83.

గీ. నీదు దర్శన మనుపమామోద మొసఁగె
నుండు కతిచిద్దినంబు లోపండిత! యిట
నేఁగఁగల వంచు నేవ్యద్వియోగచకితు
లగుచు బంధువు లిప్పుడే వగచుచుండ్రి. 84.

సీ. నాట్యమందిర మనంతక్లేశములకు సా
హసకృత్యముల కెల్ల నాశ్రయంబు
ప్రాసాదరాజంబు పైశూన్యమున కస
త్యాలాపకోటికి నాలయంబు

హింసావిశేషాదిమాంసలమ్ము హిరణ్మ
బహుళశత్రుష్ణాలతోపఘ్నయష్టి
ఖలజనోరగసముత్కరవామలూరువు
జ్ఞానవంతులకు స్మశానభూమి
గీ. యగుగృహం బాశ్రయించుకొన్నట్టికూర
చరితులము మేము నీసాంద్రకరుణఁ జిలికి,
శుద్ధుల నొనర్చి యతిచంద్ర! యుద్ధరింప
కున్న నోయన్న! యెన్న మా కున్నె దిక్కు. 85.

క. అని వాత్సల్యముఁ దైన్యము
నినుమడిగాఁ బలుకులందు నెసఁక మెసఁగఁ బ
లికినతనచుట్టములకు ని
ట్లనియెఁ బరివ్రాట్టతం డుదారార్థమునన్. 86.

గీ. అధికతాల్పత్వముల నెంచ కదిర! దేహి
కూన్చు దైవమె యోగవియోగములను
నుండవలె నిర్వికారచిత్తుం డయి నరుఁ
డిష్టము ఫలించినను ఫలియింపకున్న. 87.

ఆ. అన్నదాత యెవ్వఁ డగు నా కటంచు మ
ధ్యాహ్నవేళ క్షుత్తృడార్తి వచ్చు
నతిథిక్షుత్తు దీఱ నన్నంబు నిడ్డ సు
శీలు పుణ్యమహిమఁ జెప్పఁ దరమె. 88.

ఉ. స్నాన మొనర్చి యగ్ని నిరుసంజను వేలిచి, తాల్చి దండముం
బూని మృగాజినంబు, శ్రుతిఁ బోలఁ బఠించుచుఁ జేరువర్ణిచం
దానన మధ్యమాహమున దండియు గేస్తులయిండ్లు సేరు బి
క్షానకునై యతాత్ముఁడును శాస్త్రవదావదుఁ డౌచు నిచ్చలున్.

ఆ. తనువు నెవని యన్నమునఁ బెంచుకొనుచుఁ ద
పంబు సేయు నత్తపస్వితపము
దక్కు నట్టియన్నదాతకు సగము ద
క్కును సగమ్ము కర్త కనవె స్మృతులు. 90.

చ. అరయ విచక్షణుం డగుగృహస్థు గృహస్థితుఁ డయ్యుఁ గ్లేశముఁ
బారయక తైర్థికుల్ గనెడుపుణ్యము నొందు ధనాఢ్యుఁ డేని యం
దఱును గృహస్థుఁ జేరుకొని దానముచేతనొ ప్రీతితోనొ త
స్కరగతినో బలాత్కృతినొ చక్కఁ భుజింతురు తదీయవిత్తముల్.

క. తనుపఁదగు వేదవిదు వి
ప్రుని దాన సమస్తనిర్జరులు తనియుదు ర
య్యనఘునియం దఖలసురలు
ననయము వసియింతు రనె స్వయంబుగ శ్రుతియే. 92.

సీ. నిజధర్మనిష్ఠులు నిఖిలార్థవేత్తలు
విజితేంద్రియులును సేవితసమస్త
తీర్థుల్ పరోపకృతివ్రతుల్ మహితు
లేఁతెంతురు గేస్తు నిశాంతమునక
కావునఁ దత్తీర్థసేవాఫలంబు గే
హమునను౦డియ తద్గృహస్థుఁ డెనయు
గృహికి నిజావాసమే తీర్థ మగుట వ
దాన్యుండు గావలె ధనికుఁ డెపుడు
గీ. మూషికాద్యంతరస్థితమ్ములును గోమృ
గాంభ్రిగాదిబహిర్వర్తులైనజీవ
సృష్టి జీవించు గృహి నాశ్రయించి కాన
గేస్తు సర్వోత్తమునిగ నంకింతు మదిని. 93.

గీ. తనువు మూలంబు పురుషార్థమునకు నన్న
మాతనువునకు మూలమం చనె నిగమము
లన్న మొదవ మూల మ్మాగృహస్థు మాకు
నఖిలఫలము గృహస్థద్రుమాశ్రియంబ. 94.

క. మఱిమఱి చెప్పెద వినుఁ డా
దరమునఁ బూజింపుఁ డతిథిఁ ద్వద్గృహమున శా
తురుఁడై రాఁ;బూజితుఁ డు
ద్ధరించు, ధిక్కృతుఁడు కులము హరియించు వడిన్. 95.

క. చేయుఁ డనభిసంధిగ నా
మ్నాయోదితకర్మములు, సమస్తము పరమే
శాయత్తము సేయుం, డటు
సేయంగాఁ జిత్తశుద్ధి సిద్ధించు వెసన్. 96.

చ. జవమునఁ గౌఁగిలించు నెలజవ్వని నవ్వపుఁబైఁటఁ ద్రిల్లుచ
న్గవ నునుఁజందనద్రవమునన్ విలసిల్లు నురమ్ముతోడివా
రవుదురె కాక పీ; రిఁక మహాయతివర్యపదాబ్జపూజనో
త్సవగతపాపులై దయయు ధర్మము గల్గి తరింత్రు గాకొగిన్. 97.

చ. అని తనబంధువిప్రతతి కబ్జపదుం డుపదేశ మిచ్చి స
ల్పె నపుడు భిక్ష మాతులునివేశమునందు; భుజించి కూరుచుం
డినతఱి మేనమామయు వినేయుని కేలఁ గలట్టిగ్రంథమున్
గని యడిగెన్ సరోజపదు'గ్రంథ మిదేమి'యటంచుఁ బ్రీతిమై. 98.

—: పద్మపాదుఁడు తనభాష్యటీక మేనమామకడ దాఁచుకొని యరుగుట :—

క. మాను యన నసామాన్యుఁడు
మీమాంసాశాస్త్రమున నమేయప్రతిభా

ధాముఁడు ప్రాభాకరమత
గామి యఖిలవేదవిదుఁ డఖండయశోమండనుఁడా. 99.

ఆ. అంతవాఁడు తన్ను నాదృతి నడిగె నం
చపరిమితముదంబు నంది యార్య
వర్య! శంకరార్యభాష్యమునకుఁ డీక
యనుచు మామ కద్ది యరయ నొసఁగె. 100.

ఉ. కాంచి తదీయటీక మతికౌశలికిన్ ముద మొందెఁ గాని యిం
చించుక యెంట రెంటఁ గసియెన్ వెత, తద్రచనాచమత్కృతిన్
గాంచినమోద మన్యమతఖండనలక్షితదుర్దమోక్తియు
క్త్యంచితరీతి నస్తమయ మయ్యెను మామకు నేమి చోద్యమో. 101.

క. స్వాభిమత మై తనర్చెడు
ప్రాభాకరమతమునకు నిరాకరణం బా
యాభాగమ్ములఁ గని మది
క్షోభించి యసూయ మాటికొని వినుతించెన్. 102.

ఆ అపుడు భాగినేయుఁ డనె మాతులునకు సే
తువు భజింపఁ బోవుదును ద్వదాల
యమున గ్రంథ ముంచి యరయు మోయార్య! నా
ప్రాణ మెల్ల దానిపై నెయుండు. 103.

గీ. ఇతరులకు గోగృహాదులయెడల నెంత
ప్రేమ ముండునో యంత సంప్రీతి పుస్త
కములయెడ మా కటంచు నాగ్రంథ మప్ప
గించి వెడలెను సేతువుఁ గాంచు కోర్కి. 104.

చ. అటు చనఁ జూచున ప్పదరె నాయతివామభుజోరునేత్రముల్
తటుకునఁ దుమ్మె నొక్కఁడు, డఖిలం బది కాంచియు దుర్నిమిత్తసం

కటత గణింప కాతఁ డధికం బగువేడ్కఁ జనెన్ సశిష్యుఁడై
యెటు విధి త్రిప్పునట్లు భ్రమియించుట నైజగుణంబు ప్రాణికిన్.

శా. చింతించెన్ మది నష్టమాతులుఁడు 'స్వస్రీయుండు పేర్కొన్నసి
ద్ధాంతంబుల్ గురుపక్షహాని సలుపన్ దక్షమ్ము; లీగ్రంథముల్
సాంతంబున్ దహియింప, నాగురుమతం బవ్యాహతిన్ వ్యాప్తం మా
నిం తేలా యన; వాక్కులన్ మలఁపరా దీగ్రంథ మావంతయున్.

ఆ. నైజపక్షనాశనముకంటె గృహనాశ
నంబు మే లగుట గృహంబుతోడఁ
బుస్తకము దహింతుఁ బొడగానరా దంచు
నింటి కగ్గి వెట్టి యిట్టు లేడ్చె. 107.

ఉ. అక్కట! జాలిమాలి గృహ మగ్ని యిచే దహియించుచుండెఁ బెం
పెక్కిన సర్వసంపదలు నీక్రియ బూడిద యాట కేమవన్
దక్కఁగ మేనయల్లునమితశ్రమ మాకృతి కేద్తు నింటిలోఁ
జిక్కి నశించె నే మనుచుఁ జెప్పుదు రే పతఁ డేఁగుదేరఁగన్. 108.

గీ. అనుచు విలపించె నని యెల్లజనులు చెప్పు
కొనెదు నైతిహ్య మీవిరచనకు మూల
మఘ మొనర్చెదువాని కెంతగు ఫలంబు
దాని కినుమడిగాఁ జెప్పువాని కబ్బు. 109.

పద్మపాదుఁడు దర్భశయనాదిపుణ్యస్థలముల కేఁగుట.

మ. అటు లాపద్మపదుండు శిష్యసహితుండై యేఁగుచోఁ ద్రోవచ
క్కటి ఫుల్లర్షివరాశ్రమంబు గన రాఁగాఁ బొంగి యందేఁగె ని
చ్చట మున్ రాముఁడు రావిచెట్టు మొదలన్ జాపంబు దానుంచి ని
స్తటచింతాజలరాశిలో మునిఁగెనో దర్భాసనాసీనుఁడై. 110.

ఉ. ఏగతి సాగరంబుఁ దరియింతును జానకి నెట్లు చూతు నిం
కేగతి భూచరిష్ణు లగునిక్కపివీరులసేన లబ్ధిపైఁ
బోఁగల వంచుఁ జింత మనమున్ మథియింపఁ గుశాసనస్థుఁడై
రాఘవుఁ డుండఁ గానఁబడెఁ గ్రచ్చఱ జ్యోతి యొకండు దవ్వులన్.

చ. అభిముఖమై తదుజ్జ్వలమహ స్స్ఫురదేఁచుట గాంచి కీశరా
ట్ప్రభ నిలుచుండి ఫాలతటసంఘటితాంజలియై కనంగఁ ద
త్ప్రభయుఁ గ్రమక్రమంబుగను బంచజనాకృతిఁ దోఁచి తాపస
ప్రభుశుభరూపమై నయనపర్వ మొనర్చుచుఁ జేరవచ్చుచున్. 112.

క. పాపాపహంత సౌమ్యుఁడు
లోపాముద్రాయుతుం డలోకద్యుతి వా
తాపిదమనుఁ డర్ణవనివ
హాపోశనపటు వగస్త్యుఁ డై కనఁబడియెన్. 113.

వ. రాముండు నక్కుంభసంభవసందర్శనంబున హృదయంబునం గల
ఖేద ముపశమిల్ల నల్లన సతీయుతుం డగునమ్మహర్షి కర్ఘ్యాదు
లొసంగి తత్పదంబుల శిరంబు సేర్చి కొండొకతడ నల్లన యుండి
ధృతిఁ బూని యుత్థితుఁడై యి ట్లనుం. 114.

ఆ. జనకసముని నిన్నుఁ గనఁ గల్గుట శమించె
నెల్ల దుఃఖ మబ్ధి యింకినటుల
యే నవాప్తకాముఁ డైనాఁడ మాసూర్య
వంశ మొందె నేఁ డవార్యమహిమ. 115.

సీ. తొలుత రాజ్యపదచ్యుతుఁడనై సతీభ్రాతృ
సహిత మరణ్యవాసము నొనర్తు
నచట మారీచుమాయల నేను దవ్వేఁగ

నవనిజ రావణుం డపహరించెఁ
గొనిపోయి యసుర సీత నశోకవని డాఁచె
నని మే న్దొలుఁగనున్న దనియు వింటిఁ
దరుచరాధిపునిమైత్ర్యము గాంచి త త్సేన
గొలువ రా నడ్డ మీజలధి దగిలె
గీ. దాఁటు టెటు? దీని రక్కసు గీటడంచు
టెట్లు? జానకిఁ దెచ్చుటయె? ట్లటం చు
పాయ మెఱుఁగక యుండ నాపాలిదైవ
మనఁగ నీదర్శనం బబ్బె మునిలలామ! 116.

వ. అనుటయు నత్తాపసలలామం బి ట్లనియె. 117.

చ. వగవకు వత్స! భానుశశివంశజు లైనమహాత్ము లెందఱో
వగల మునుంగరే వ్యసనవర్జితులై విలసిల్ల రొక్కొ! ము
జ్జగమున నీసహోదరునిసాటి ధనుర్ధరుఁ డుంట కల్ల, యి
య్యగచరనేత బాసటగ నబ్బె ననాథుఁడ నంట లెస్సయే. 118.

గీ. ఇంతటిసహాయసంప త్తి యిరవుకొనియె
నే నిదె హితోపదేష్టనై యేఁగుదెంతు
నింక నివ్వారిరాశి ని న్నేమి సేయు
స్వాంతమందుఁ దలంపు గోష్పదము గాఁగ. 119.

చ. కలికముఁలోనికేని యుదకం బొకబొట్టును లేనియట్టు లీ
జలధి నొనర్తు, నీవుఁ గపిసైన్యము నేఁగఁగ వచ్చుఁ గాని యం
దుల యశ మెల్ల నాదె యగుఁ, దోయధి నీ వెటొ కట్టితేని య
య్యలఘుయశంబు నీది యగు యత్న మొనర్చి రచింపు సేతువుణ్.

మ. అరిఁ జెండాడి ధరిత్రిపుత్రిఁ గొని నీ వాచంద్రతారార్క మా
స్థిరకీర్తిన్ గను మం చగస్త్యముని యాశీర్వాదముల్ జేసి క
న్గొంటన్ సేతువు గట్టి వార్ధికిఁ గపీంద్రుల్ సేనతోఁ గొల్వఁ జె
చ్చెర లంకాపురి సొచ్చి వ్రచ్చి రిపు, దెచ్చెన్ రాముఁ డాభూమిజన్.

వ. అని యాక్షేత్రమహిమ వర్ణించి తత్తీరంబున నాభిక్షువు స్నానం బాచరించి రామనాథునకుఁ బ్రణామము లొనర్చి మనుజులకు శ్రద్ధ గలుగుటకై తద్దేవభవం బంతయు శిష్యులకుఁ జెప్పుటయు నందొ క్కపండితుం డగుశిష్యుండు 'రామేశుఁ' డనునామ మేసమాస మనుటయుఁ దత్పురుష కర్మధారయ బహువ్రీహి భేదంబుల ము త్తెఱం గగు నని పద్మపాదుం డిట్లు వివరించె. 122.

గీ. తత్పురుష మంచుఁ దొలి రఘూద్వహుఁడు నుడివె
నభవుఁ డనియె బహువ్రీహి యనుచు భక్తి
నమరు లది కర్మధారయం బనిరి సమస
నమ్ము వివరింప 'రామేశ' నామమునకు. 123.

చ. అనుచు సమాసముల్ దెలుప నచ్చటికోవిదలోక మెల్లఁ ద
ద్వనరుహపాదుధీపటిమ భక్తి నుతింపఁగఁ గొంతకాల మం
దున వసియించి శిష్యసహితుం డయి తీర్థము లెల్ల నాడి య
య్యనఘుఁడు మాతులీయనిలయంబును జేరెను బర్యటించుచున్.

సీ. గృహదాహమును విని ఖిన్నుఁడై యాపద్మ
పాదుఁ డాగ్రంథావసాదనమున
కందిన యార్తి కంటెను మాతులు
నిల్లుపోకకు దురటిల్లి మిగుల
'నను విశ్వసించి డాఁచిన గ్రంథదాహమ్ము
నకె కాని గృహనాశనమున కడలు'

నసెడు మాతులుని నూఱార్చి నాబుద్ధిలోఁ
కలదు గ్రంథ మ్మని తెలిపి యప్డు

గీ. వ్యాఖ్య మరల రచింప నుపక్రమించు
టెఱిఁగి బుద్ధిఘ్ను మగుద్రవ్య మిరవుకొల్పి
యోగిరము వెట్టి తినిపించె భాగినేయు
నప్పయోముఖవిషకుంభ మంత్రి జనులు. 125.

పద్మపాదాదిశంకరశిష్యు లొక్కటఁ గూడుకొని యాచార్యులఁ జేరుట.

వ. ఆసమయంబునఁ దన్నుంబోలెఁ దీర్థయాత్రాపరు లగుసతీర్థ్యులు కని ష్ఠాశ్రమస్థు లగుకొందఱా వృత్త మెఱింగి యరుదెంచి కృతప్రణా ములై యనేకదివసయోగక్షైమ్యమునఁ బరస్పరప్రశంసల నొనర్చు కొనిరి. 126.

మ. పటువాచావిజితాంగిరఃఫణిపతిప్రాచేతసుల్ దద్విశుల్
ఘటితాచార్యపదాబ్జచిత్తు లయి శంకల్ దక్క యాపల్లవో
త్కటతర్క బల్లవ మట్లు దుంచి యసుహృత్తత్వాహితాత్వాహితా
ర్భటి దీపింతురు; దేశికాంఘ్రి పురుషార్థం బెద్ది చేకూర్పదో. 127.

గీ. అంతఁ దచ్ఛంకరార్యశిష్యప్రతాన
మాలకించె స్వదేశకీయమును సుఖద
మైనయొకవార్త నఖలతీర్థాటనంబు
సలిపి వచ్చినయొకవిప్రకులునివలన. 128.

చ. గురువరుఁ జూడఁ జాలమికిఁ గొందల మందెడుశిష్యబృంద మ
క్కరణి నెఱింగి పొంగి కనఁగాఁ జనఁగోరిరి కేరళాన; క
త్తఱి కె గురుండు గూడఁ దనతల్లికి నంత్యవిధుల్ పొనర్చి ని
బ్బరముగ నాత్మధర్మపరిపాలనసక్తి విరక్తి రాజిలెన్. 129.

క. కేరళమున విష్వక్సం
చారుండై మానసమున ధాతుప్రలరారన్
గోరి చని పొగడ దేశికు
డీరీతి మహాసురాలయేశు నొకతఱిన్ 130.

సీ. పరిపూర్ణుడవు జగత్పతి నీవు లీలచే
నప్రయోజనవాంఛ నధిగమించి
సృజియింతువట చిదచిద్రూపముగ జగ
మపగతసదసత్త్వ మైనప్రకృతిఁ
ద్రిగుణమ్ము లూని యీజగము పుట్టించి ర
క్షించి తుదింతువు త్రిమూర్త్యంచనమున
వివిధజలప్రతిబింబితరవియట్లు
విశ్వగతిన్ బహువిధముఁ గందు
గీ. వనియభిష్టుతు లొనరించు చా విశిష్టుఁ
డమరసద్మమ్మునం దుండువసరమున
సుచిరవిరహార్తు లైనశిష్యులు నమస్క
రించిరి తదంఘ్రి యుత్తంసవృత్తి మెఱయ 131.

క. కుశలానుయోగపూర్వము
వశిచంద్రుఁడు శిష్యతతిఁ గృపం దేర్ప వ్యథా
కృశుఁ డజహద్గద్గదికా
వశుఁడై కంపిలుచుఁ బద్మపాదుం డనియెన్. 132.

క. దేవా! శ్రీరంగేశ్వరు
సేవించి మిముర్ భజింపఁ జేరుమ నుండన్
దోవను మాతులుఁ డగపడి
స్వావసథము సేర్చెఁ బ్రీత్రియమ్మున నన్నున్. 133.

ఆ. అతఁడు భేదవాది యని యెఱింగియును బూ
ర్వాశ్రమీయవాసనానుబంధ
వశత యుష్మదీయభాష్యటీకఁ బఠించి
యొప్పితిని గృతానుయోగు మామ. 184.

గీ. దగ్ధముద్రాస్యముద్రమంత్రమ్ము లగుచు
ధ్వస్తగురుతర్కకపిలతంత్రమ్ము లగుచు
నిగమసారామృతముఁ జిల్కునీదుసూక్తు
లనెడు వర్మమ్ము దాల్చి మామను జయింతు. 185.

సీ. కాణాదసేనాముఖమున ఖడ్గాఖడ్గి
విహరణంబున నింత వెతను గనునె
పశ్యత్పదానీకపటలిశస్త్రాశస్త్రి
రణరంగమునయందు శ్రమ మెనయునె
కాపిలబలముతోఁ గడఁగి యష్టీయష్టి
యొనరింప నాయాస మొందునొక్కొ
జైనబౌద్ధాదిపాషండులతో గదా
గది యాజి నస దైనఁ గందునొక్కొ

గీ. ధీర! యాక్తికవంశమౌక్తికమయమ్ము
లైనభవదీయసూక్తిసంతానములను
వ్యూథకంకటుఁ డైనయే బుధుఁడు గాని
యఖిలజగములఁ గాలత్రయంబునందు. 136.

వ. అది యట్లుండె నవధరింపుము. 137.

సీ. అతఁడు గాఢోత్కంఠుఁడై యభినందన మొనర్చె
నన్ను నావ్యాఖ్యను మున్నువోలె
నమ్మి మామకము గ్రంథమ్ము దగ్ధగృహమందు

విన్యస్త మొనరించి వెడలినాఁడ
నర్ధరాత్రిము స్వగేహముఁ గాల్చి మామ మ
త్కృతకృతి భస్మసాత్కృతము గాఁగ
బుద్ధిహానికి భైక్షమునఁ బెట్టి గరళమ్ముఁ
గృపణుఁడై యని పుట్టెఁ గింవదంతి
గీ. యేది యెటులైన దుర్విధి నాదునది య
సంశయ మ్మౌచుఁ బూర్వప్రసాద మెనయ
దాయె భవదీయసేవాపగాయణులకు
నిట్టి విషమోగ్రదశ యుక్తమే మహాత్మ! 138.

ఆ. అట్టు లగ్నిఁ గొనినయాటీక నెల్లను
మరలఁ గూర్పఁ బోవ మందమతిని
యుక్తిపాటవంబు సూక్తులు మున్నట్లు
కలుగ దాయె నెంత గాసిపడిన. 139

చ. పరమదయాస్పదం బగుభవత్పదముల్ శరణొందునట్టియం
దఱు నతిదీను లైనఁ బరితప్తుల యైనను గందు రమ్మహే
శ్వరుపద మార్య! త్వచ్చరణభక్తుఁడ నా కపరాధ మున్నె? యే
దురితము మాపదార్త్రాణముతోఁ జెఱు నం డ్రిది సేయు సార్థముల్.

చ. అని వచియించు పద్మపదు నాఁగురుపాదులు వల్కి రుత్తమా
ర్థనిబిడతన్ దయారసకరంభితచిత్తసరోజు లౌచు సాం
త్వనవచనంబులన్ శ్రవణతత్పరచిత్తతమోపహారకం
బు నమృతసాగరోపమితముల్ బుత మాఘణితిన్ స్మితాస్యులై.

క. విషమము కర్మవిపాకము
విషమోహాసమం బవార్యవిక్రమ మనుసీ

విషయము సురేశ్వరునితో
మృష గా దెపు డనుచుఁ బల్కెనే యానాఁడే. 142.

ఆ. ఒనర వార్త్తికమున కుత్సాహియై యుండు
నతని కీరు గూర్చునలపరాభ
వాగ్నిసుమి త్వదీయ మగుగ్రంథమును గాల్చెఁ
గాదు మేనమామ, గాదు వహ్ని. 143.

క. ఇతరులమన మున్నరు మను
గతి నిర్వ్యాతుకము మసలఁ గా, దయ్యావమా
నితుచిత్తక్షోభము సం
తత మేర్పఱె భస్మపిహితదహనోపమమై. 144.

క. ఎంతవిరాగము గల్గిన
నెంత తప మొనర్చినను మఱెంతగ శాంతిన్
దాంతి గడించిన నేని ర
వంతయనూయకును లోఁగ నఖిలము ఖిలమా. 145.

వ. అది యట్లుండ నిమ్ము మున్ను శృంగగిరిక్షేత్రంబున నామూలాగ్ర
ముగాఁ బంచపాది వినిపించితివిగదా; దాని నేను మఱువలేదు ఖేద
మ్ముడిగి క్రిమ్మఱ లిఖించుకొమ్మని యూఱడిల్లఁ బలికి యప్పుడ.

కాలిపోయిన పంచపాదిగ్రంథమును శంకరులు ధారణాబలమునఁ జెప్పుట.

ఉ. చెప్పెను బద్మపాదుఁడు రచించినతొల్లిటియానుపూర్విత్తో
నొప్పఁగఁ బంచపాదికృతి నొయ్యన నయ్యతి-సర్వవిద్యలన్
గుప్పి జగత్త్రియంబును గకుప్పలఁ గప్పెడుజ్ఞానశక్తిచే
నొప్పెడు దేశికాఖ్యపురుషోత్తముఁ డట్టుల సెప్ప టబ్రమే? 147.

సీ. పద్మపాదుండు రభస మప్పంచపాది
వ్రాసికొని పరమానందభరితుఁ డగుచు

లేచుఁ గూర్చుండు విలపించు నాఁడికొనును
బరవశుం డయి యెలుఁగెత్తి పాడు నాడు. 148.

వ. అంత. 149.

శంకరుఁడు కేరళరాజునకు నాటకత్రియముఁ జెప్పుట.

మ. కవితాప్రౌఢుఁడు రాజశేఖరసమాఖ్యాకుండు తత్కేరళో
ర్వివిభుం డాయతిచిత్రవార్త వినుచుఁ విచ్చేసి కొటీరర
త్నవిఘృష్టాంఘ్రిపయోరుహుఁ సలుపఁదత్ఖర్మంది యానందమొం
ది విభుఁ దత్కృతనాటకత్రియనువ్యాప్తింగూర్చిప్రశ్నించుచుఁ.

క. మొగ మింత సేసికొని య
జ్జగతీవరుఁ డనియెఁ బద్ధచరణగచితకో
శగతిన నానాటకములు
దగులంబడె వీతిహోత్రధాటికి లోనై. 151.

క. అన విని శంకరసంయమి
మును వినుటను నాటకములు మూఁడింటిఁ బఠిం
చిన లిఖియించుకొనియెఁ ద
జ్జనపతి విస్మయతరంగితస్వాంతుండై. 152.

ఉ. స్పష్టముగా లిఖించుకొని పార్థివచంద్రుఁడు పొంగుచుఁ మనో
భీష్ట మొదేని యున్న వచియింపుఁ డొనర్చెద నంచుఁ బల్కని
ర్కృష్టభవానుబంధుఁడు యతీంద్రుఁడు వల్కెను వైదికక్రియా
భ్రష్టులు గాఁగఁ గాలటినివాసుల కిచ్చితి నేఁడు శాపముఁ. 153.

క. నాయిచ్చినశాపము భూ
నాయక పాలింపు మీ వనారతమును వై
ధేయులు వారలు నీకు వి
ధేయులు సుమి యనుచుఁ బలికె దేశికుఁ డంతఁ. 154.

గీ పద్మపాదుఁడు నష్ట మౌపంచపాది
నెనసి సంతుష్టిఁ గనఁ గేరళేశ్వరుండు
నాటకత్రియ మొంది ప్రీణాత యగుచు
గురుపదధ్యానరతుఁ డౌచు నరిగెఁ బురికి. 155.

శంకరుఁడు క్షేత్రయాత్రకు వెడలుట:—

ఉ. చెంతలఁ జేరి కొల్చుచు స్వశిష్యసహస్రములుగా సుధన్వభూ
కాంతుఁడు వచ్చుచుండ నధికం బగుసర్వదిశాజిగీష నా
దాంతుఁడు శంకరుండు దొలుతగా జనె సేతువు దాఁకఁ బోవ మా
ర్గాంతర వర్తమాన కుమతాంతరవర్తి జనార్తికంబుగన్. 156.

వ. అట్లు పద్మపాదహస్తామలకసమిత్పాణిచిద్విలాస జ్ఞానకందవిష్ణుగుప్త
శుద్ధకీర్తి భానుమరీచి కృష్ణదర్శన బుద్ధివృద్ధి విరించిపాద శుద్ధానం
తానందగిరి ప్రముఖసహస్రశిష్యులతోఁ గూడి శంకరుండు చనుచు
మధ్యేమార్గంబు మధ్యార్జునం బనుశివావిర్భూతక్షేత్రంబు సొచ్చి.

గీ. వనజగర్భాదిపూజితాంఘ్రిని నదృష్ట
చరుని మధ్యార్జునాహ్వయపరమశివుని
బుద్ధి నుపచారములఁ గొల్చి పొడవుమీఱు
పాపముల వీడ్కొని ఫలైకపాత్రమయ్యె. 158.

వ. అట్లు కొలిచి యాభగవత్పాదులు మధ్యార్జునక్షేత్రాలంకార
మగుమహాదేవు నుద్దేశించి యిట్లనిరి. 159.

క. నీవే యుపనిషదర్థము
నీవే సర్వజ్ఞుఁ డగుట నిగమాభినుతా
ద్వైవరలున దద్వైతము
దేవా! ద్వైతమ్మొ తెలిపి తీర్పుము శంకర్. 160.

మ. అన మధ్యార్జునలింగమౌళి నొకదివ్యజ్యోతి తోఁతెంచి బో
రన "యద్వైతము సత్య" మంచును ద్రివారం బార్చి మాయఁబుగాఁ
గను, దద్ద్రష్టలు నద్భుతంపడి యశంకన్ శంకరాచార్యపా
వనపాదాశ్రయులై గ్రహించి రపు డద్వైతాధ్వమున్ భక్తిమై. 161.

వ. మఱియుఁ బ్రాతఃస్నానాదివిశుద్ధులై యాదిత్యాంబికావిష్ణుగణనాథమహేశ్వరాత్మకపంచాయతనపూజాతత్పరులుం, బంచయజ్ఞపరాయణులు శ్రుత్యాచారరతులు శుద్ధాద్వైతబద్ధబుద్ధులు నగుటయు వారల వీడ్కొని శంకరుఁడు నశిష్యంబుగ రామేశ్వరంబు సేరుటయు నప్పట. 162.

శంకరులకు శాక్తులతో వాదము.

క. జరిగె గిరిజార్చనాచ్ఛల
పరిపీతాసవము శాక్తపటలముతో శం
కరులకు మతవాదము పరి
సరజనదత్తానుమోదసద్యుక్తికమై. 163.

వ. అది యెట్లనః—నాశక్త్యుపాసకు లెల్ల యతిశేఖరునకు మ్రొక్కి "స్వామీ మామతంబు పావనం బవధరింపుము. శంభుగుణముల కవ్వలిదియు, నశేషకార్యజననియు, నాద్యయు నగుశక్తిచే మహదాది సకలజగం బుత్పన్న మగు. 164.

గీ అల్లపరశక్తి వాఙ్మనసానవాప్య
యగుట సేవింపరామిఁ దదంశ మగుభ
వానిపాదంబురుహము లన్వహము పూజ
సలుపుచుండుదు మార్య! నిష్కలుషభక్తి. 165.

క. శ్రీవిద్యోపాసకులకు
జీవన్ముక్తిని ఘటించు శ్రీశక్త్యంఘ్రుల్

గావునఁ దాల్తుము బుజముల
గ్రీవాస్థలి వాని స్వర్ణకృతచిహ్నములన్. 166.

గీ. విద్యను నవిద్య నెఱుఁగు నేవేత్త; యతఁ డ
విద్యఁ గాని మృత్యువు జయించి విద్యచేత
నమృత మొనయును గాన విద్యాస్వరూప
యంబయ ముముక్షువుల కవలంబ మగును. 167.

గీ. ఈశరూపిణి ప్రకృతి యా;నీశ్వరప్ర
కృతులకు నభేదకలనము శ్రుతికథితము
కన 'సద్దైవ'మాదివాక్యములు తత్ప
రమ్ము లౌట నవ్వియె ప్రమాణమ్ము లిందు. 168.

సీ. ప్రణవస్థ మగునకారప్రభృతుల కట్లు
శాంభవీప్రముఖతచ్ఛక్తులకు స
మత్ప త్తి గలుగుచునుండు; సమస్తదై
వతకారణం బగుప్రభునకుఁ బర
మై చంద్రునకు జ్యోత్స్నయటుల రుద్రోద్బోధ
కస్వరూపిణి యాచుఁ గ్రాలుచుండు
స్వాధీనవల్లభ యనఁబడు రుద్రశ
క్తి భవాని యని నమ్మితిమి త్రిశుద్ధి
గీ. పూరుషోత్తమ! తచ్చిహ్నధారి వగుచు
నావిముక్తిద నాజగదంబ నీశ్వ
రిని యుపాసింపవలయు నీ వనుచుఁ బలుక
వారితో నిట్టు లాచార్యవర్యుఁ డనియె. 169.

క. పరఁగ నిది సత్య మైనను
'బురుషోత్తమబోధమునన ముక్తి' యని శ్రుతో

త్కర మనుట; నాత్మ నాత్మను
బొరసిననే కలుగు ముక్తి, పొడమ దిం కొంటన్. 170.

గీ ఇందులం బ్రమాణ మగుం 'దమేవైన'మాది
వాక్యతతి, యజామిత్యాది వాక్య మయ్యు
జాస్వరూపమ్ము దెల్పి, మోక్షమ్ము వడయు
కొఱ కని పరేశుతత్త్వమే యెఱుక పఱిచె. 171.

క. మఱియును సాంఖ్యులు ప్రకృతిని
నెఱిఁగి, వికృతినూరుఁ బరుని నెఱుఁగుటనే చె
ప్పిరి ముక్తిగఁ గాన సుఖా
కరు నీశ్వరు నెఱుఁగ ముక్తి గలుగును జారే. 172.

క. బ్రహ్మేత్యాదికనిగమము
బ్రహ్మముతో జ్ఞాని కైక్యభావము నొడివెన్
'బ్రహ్మైవ' యనుచుఁ గావున
బ్రహ్మజ్ఞానమ్ము మీరు పడయుఁగవలయున్. 173.

గీ. ఏయుమ భవాని యని వచియింపఁబడియె
నామె యద్వైతబోధివిద్యాస్వరూప
విమల కమ్మహాదేవి సేవించుచుండ
శీఘ్రముగఁ గైవసం బగుఁ జిత్తశుద్ధి. 174.

వ. కావున మీరు కుంకుమపుండ్రాంకమును హైమపాదాదిచిహ్నము
లను విసర్జించి 'బ్రహ్మహ'మ్మనెడువిద్యయందు నాసక్తులరు గం
డనుటయు. 175.

అ వారు చిహ్నములను వడి వీడి శంకరు
గురునిగాం దలంచికొనుచు స్నాన

సంధ్యలందుఁ గనిరి శ్రీద్ధ శుద్ధాద్వైతు
లగుచుఁ బంచపూజనాదిసక్తి. 176

లక్ష్మీభక్తులతో వాదము

ఆ. అంత నటకు శ్రీమహాలక్ష్మీభక్తులు
వచ్చి గురున కెఱఁగి పలికి రిట్లు
వినుము దేవ! శాస్త్రవిహితంబు యుక్తిస
హంబు నైనమామతంబురీతి. 177.

సీ. బ్రహ్మాండజనని సర్వఫలప్రదాత్రి మ
హాలక్ష్మియే యాద్య యైనప్రకృతి
యగు 'సప'దిత్యాదినిగమోక్తి; 'నీక సదే'
వేతివేదోక్తి విధాతృముఖ్యు
లమల మహాపురుషోత్తమాంగమునుండి యే
యింతియందు జనింత్రో, యెవతెయంద
పరమేశునకుఁగూడఁ బరఁగు నంతర్భావ,
మాదేవి సేవ్య మోక్షార్థులకును
గీ. కుంకుమాంకితహాళు లబ్జాంకలసిత
భుజులు పద్మాక్షమాలావిభూషు లగుర
మాసమారాధనాసక్తమతులకుఁ గర
గతమ యగు ముక్తి, కాన మామతము గొనుము. 178.

వ. అనుటయు శంకరుం డాశ్రీభక్తులతో దత్త్వంబు దెలిపెద వినుం
డని యిట్లను. 179.

సీ. సదసత్స్వరూపుఁడై జానొందు నద్వితీ
యుఁడు పరమాత్మ యొక్కఁడ జగంబు

సృజియించువాఁడు గా కితరుండు లేఁడు 'స
ఆత్మ' యన శ్రుతిచేత వ్యాహృతుఁ డగు
నానందరూపుఁడై యలరు సదా తద
ధీన యీప్రకృతి కెందేని మోచ
కత్వమ్ము చెల్లునే? కడఁక నెవ్వండు "బ్ర
హ్మాహ" మంచును ధ్యాన మాచరించు
గీ. వానికి విముక్తి కరగతం బౌ ననిత్య
దేవతోపాసకులకుఁ దద్విధజగములె
తాఁ గానఁ గుంకుమపద్మధారణంబు
విడిచి కైకొనుఁ డద్వైతవిద్య ముక్తి. 180.

క. అని శంకరు డుపదేశిం
చిన వా రద్వైత మూఁది శిష్యత్వము గాం
చిన యావృత్తాంతము విం
చును జేరఁగ వచ్చి రాశుశుక్షణికల్బుల్. 181.

శారదోపాసకులతో వాదము.

ఉ. భాసురపుస్తపుండ్రకవిభాపరిచిహ్నితు లౌచు శారదో
పాసకు లయ్యతీంద్రునకు వందనముల్ పచరించి, నిత్యతా
భాసిలు వేద; మట్లగుట భారతి నిత్యయు లోకహేతువున్
హ్రాసవినూరరూపయుఁ బరాత్పరమూర్తియునై విరాజిలున్. 182.

గీ. ఆమెయే బ్రహ్మ హరి హ రాద్యఖిలశబ్ద
గమ్య, యా దేవియే జగత్కర్త్రి నిత్య
యను శ్రుతి, ముముక్షువులకు నుపాస్య యగుట
నాగుణాతీత నీకు నుపాస్య యగుత. 183.

గీ పర మయినవాక్స్వరూపంబు నెఱుఁగఁ డింత
శ్రుతిగతార్థానభిజ్ఞుఁ డంచును వచించుఁ
గాదె 'నావేద'యనుసూక్తి? గని తదర్థ
మానఁ దగు వాక్స్వరూపసంధాన మవుల* 184.

చ. అనుటయుఁ "కంఠ తాలు రదనాదిక సంగతిఁ బుట్టువేద మే
యనువున నిత్యమౌ"ననియు నయ్యుతియిట్లను-వర్ణమాత్రమా
కన ధ్రువ మైన?దక్షరనికాయమ?యాదిను మెప్డు గాదు గ్రి
న్నన నవియున్ జగల్లయమునన్ లయ మొందు ధ్రువంబులెట్టులో?

క. అమరు శ్రుతు 'లీశునిశ్వసి
తము లై' యనుసూక్తి జన్యధర్మమ్మున; జ
న్యము లెల్ల ననిత్యము లను
ప్రమాణమునఁ గాదు సుఁడీ ధ్రువం బంతిమమున్.

సీ. అంగసమన్వితం బగువేదము యుగాంత
మున లయం బొందుడు, మునులకు రవి
సెప్పె నంచును సూర్యసిద్ధాంతమున నుండెఁ
బ్రళయ మొందినవేదరాశి కర్కు
వలనఁ బ్రవర్తనం బలవడుటను శార
దను నెట్లు గల్గు సత్యత్వ మకట!
సుర లనిత్యుల మైనఁ బరమేష్ఠి ధ్రువుఁ డౌట
నిత్యయే వాణి యండ్రేని వినుఁడి

*క. వేదార్థవివేకరహితుఁ
డే దెసఁబరవాక్స్వరూప మెఱుఁగడ యని "నా
వేదే"త్యాద్యుక్తి కలిమి
వేద మెఱిఁగి వాక్స్వరూపవిదుఁ డౌట తగున్.

గీ. యాదిమప్రాణి యాట నిత్యత్వశూన్యఁ
డగుచతుర్ముఖముఖముల నలరుశార
దకు ననిత్యత్వ మర్థసిద్ధమ్మ కాన
శమ మ దేల వాఙ్నిత్యతాసాధనమున. 187.

వ. పరమాత్మాతిరిక్తంబునకు నృపాత్వంబు సిద్ధంబ కానఁ బరమయుఁ బ్రకృతియు నగుశారదయె మహదాదివిశ్వంబునకుఁ గారణం బగు ట యసంగతము వాగాద్యతీతం బగునప్పరమభూమం బొక్కటియె సదాదిశబ్దబోధనీయము కాని ప్రకృతి కా దని యెఱింగి సదాది శబ్దంబుల బ్రహ్మజ్ఞానము సాధనీయంబు, ముక్తిపదంబు నొంద నా త్మజ్ఞానముదక్క నన్య మగునుపాయంబు లే దని వేదము పలుకుట లేదె?అట్లుగాన శుద్ధాద్వైతబద్ధబుద్ధులరై మీరు స్నానాదిసకలకర్మ మ్ము లీశ్వరార్పణబుద్ధి సలిపి దురితములఁ దొలఁగి శుద్ధులై యా నందఘన మ్మగుబ్రహ్మము నెఱిఁగిననే ముక్తు లగుదురు కాని య న్యథా కానేర రనుటయు నాశారదోపాసకు లెల్లరు శంకరార్య శిష్యు లైరి యంత వామాచారు లగుశాక్తులు కొందరు జగద్గురుఁ గాంచి యి ట్లనిరి. 188.

వామాచార శాక్తులతో వా వాదము

మ. వెడవేసమ్ము ధరింతు, వారయవు సంవిద్రూపముఁ మూఢుకై
వడి,వంధ్యాతనయోపమం బైనయద్వైతప్రబోధంబునఁ
బడె, దద్వైతమె సున్న, భేదము లయావస్థాప్తినే నుంట-మా
నుడు లాలించి గ్రహించి శక్తిమతముఁ, మోక్షమ్ము చేకొఁగదే.

సీ. పృథగాకృతిని నెద్ది యీశునందు విమర్శ
మనుసంజ్ఞతో వెల్గు ననవరతము
నెయ్యది లేక పరేశుండు నల్పకి

యాచరణంబునం దవముఁ డగును
సంతతం బెయ్యది సర్వస్వతంత్రమై
యెల్లలోకము సృజియించుచుండు
శివునకు బీజమై చెల్వారు నెయ్యది
విద్యాస్వరూపమై వెలయు నేది
గీ. యట్టిపరశక్తి భజియించునట్టివారి
కే లభించును ముక్తి తదితరులకు న
లభ్య మగుఁ జూవె పెక్కు లేలా వచింప
నఘచయజిఘాంస! పరమహంసావతంస. 190

గీ. 'అవిమర్శాభిధాన మవ్యక్త' మనుచు
బ్రహ్మభృగ్వాదు లనిరి తత్త్వమ్ము నరసి
దానికంటె నన్యం బయి తనరునట్టి
సకలము చరాచరము తద్వశమ్మె సుమ్మ. 191.

ఉ. ఆపరశక్తిభక్తులయి యంచితసిద్ధులు గన్నవారి కా
క్షేపము లే దెటన్ విధినిషేధము లుండమి; నిర్గుణార్థ్యగ
శ్రీపరకోటికిన్ విధినిషేధము లంటునె? కాన మాకు న
త్తాపసు లౌభృగుప్రభృతి ధన్యులవర్తనముల్ ప్రమాణముల్.

క. కావున మీ రితరమ్ములఁ
బో విడిచి గ్రహింపుఁ డాత్మ ముక్తికిఁ బర యా
శ్రీవిద్య నంచు నుడువం
గా విని యాచార్యుఁ డీప్రకారము నొడివెన్. 193.

సీ అటు పల్కఁ దగునయ్య "యత్రి" యన్ శ్రుతి యనా
త్మమున కెల్లను నిషేధము వచించెఁ
గానఁ దా వెందుఁ గల్గద విమర్శమున క

నాత్మంబునకు సత్యతాప్తి లేద
యధ్రువ ప్రకృతి నుపాసింప ముక్తి రా
దాలింపుఁడయ్య 'మాయాభి రింద్ర'
యను శ్రుతిసూక్తిచే నాప్రకృతికి బహు
రూపత గల్గు టెఱుంగఁబడియెఁ

గీ. గానఁ బ్రకృతికిఁ బరము సుజ్ఞానగమ్య
మఖిలసృష్టిప్రభువు నా చిదాత్మ యొకఁడె
వెలుఁగుచుండు ముముక్షువిజ్ఞేయ మగుచుఁ
దద్విజిజ్ఞాసఁ గొని యమృతంబు గనుఁడు. 194.

వ. మఱియు 'ఈశానో భూతభవ్యస్య' యను శ్రుతిం జెప్పఁబడిన పర
మాత్మ నకించిత్కరుం డనుట మాధ్యంబు గాదె. 195.

క. కలదే బ్రాహ్మణ్యము ని
చ్చలు కలు ద్రావుచుఁ గళంజజక్షణరతులై
మెలఁగెడుమీ, కటు గావున
సలుపుకొనుఁడు నిష్కృతిన్ వెసన్ విహితగతిన్. 196.

చ. భృగుఁ డఱగాలఁ దన్నె మను వెన్నుని, సాగరసప్తకంబు లె
స్సగఁ జుళుకించి క్రోలె ఘటజన్మమహాముని, యట్టిశక్తి మీ
కుఁ గలుగ దేలకీమాధ్య మిఁక గొబ్బునఁ ద్రోచి ద్విజాతిధర్మముల్
డిగ విడనాడుమీరలు కడింది వినిష్కృతి సేసికొందగున్. 197.

మ. అనుడున్ వారలు మొక్కి శాస్త్రవిధిఁ బ్రాయశ్చితముల్ చేసికొం
చనిదంపూర్వపవిత్రవృత్తు లయి శుద్ధాద్వైతబద్ధాదరం
బునఁ బంచాయతనార్చనాది సకలంబుల్ సల్పుచున్ శంకరా
ర్యుని సేవించిరి శిష్యు లౌచు నపుడే యుత్సృష్టసందేహులై. 198.

చ. ఇటు పటుయుక్తిసూక్తుల యతీంద్రుఁడు దర్పలగొంచు నీచవా
క్పటుల నెదిర్చువారి ద్విజజాతిబహిష్కృతు లౌననార్యులన్
బటుమతులైనశాక్తుల క్షణంబునఁ దత్ప్రతివాక్యలాపనా
పటువులఁ జేసి లోకహితవాంఛ రచించెను గర్మసేతువున్. 199.

శంకరుఁడు రామేశ్వరమున కరుగుట.

మ. క్రమ మొప్పం గనుఁగొంచుఁ బూర్వరమన్ రామేశ్వరక్షేత్రసీ
మము నెల్లన్ వలగొంచు వచ్చి కనెఁ దన్మధ్యస్థసౌవర్ణహ
ర్మ్యమునన్ రాఘవసంప్రతిష్ఠితుని సవ్యార్ధాంగమాతాగ్రహ
స్థు మహానీలలసత్కిరీటు జగదీశున్ రామనాథేశ్వరున్. 200.

సీ. సేతుపరిష్కృతసింధూర్మికల రామ
నాథార్పణముగ స్నానం బొనర్చి
నభిషేక మొనరించె నమలంగగాంబులఁ
బొంగి తత్సైకతలింగమునకు
నారగ్వధాబ్జదుత్తూరపస్రవ బిల్వ
పత్త్రరాసులతో సపర్య నడసె
నానాఫలమ్ముల నైవేద్య మర్పించెఁ
గమ్మని కవిత స్తోత్రమ్ము సేసె

గీ. శంకరాచార్యుఁ డిటు నిజచ్ఛాత్రసమితిఁ
గూడుకొని బ్రహ్మభావన షోడశోప
చారముల రామనాథు హార్దమునఁ దేల్చి
రెండుమాసము లచటనే యుండఁ దలఁచె. 201.

వ. అంత నాక్షేత్రవాసులును, దత్పరిసరజనపదనివాసులు నగుప్రజ
లును శంకరాగమనంబు విని దర్శింప గుములు గట్టి నిరంతరం బరు
దెంచి తద్బోధనమునఁ దనియుచుండుదు రట్టియెడ. 202.

సీ. అద్వైతమాషకు లంచితలింగాంక
బాహుయుగ్మకులు శైవవ్రజంబు
శూలాంకచిహ్నితఫాలస్థలులు లింగ
ముద్రితాఖిలతనుల్ రుద్రభక్తు
లురడమర్వాంకబాహులు లింగధరులు మ
స్తకధృతశూలురు జంగమాలి
శూలాంకలక్షితఫాలవక్షోనాభి
బాహావిరాజితుల్ పాశుపతులు

గీ. గుములు గుములుగ పచ్చి యగ్గురులలాముఁ
గాంచి ప్రణమిల్లి యీరీతిగా వచించి
రఖిలమతముల కుత్తంస మని యొకొక్క
రాత్మమతగతవివిధసిద్ధాంతములను. 203.

వ. అందుఁ బాశుపతు లిట్లనిరి 204.

క. కారణ మీశ్వరుఁ డగుట స
దారాధ్యుఁడు చిహ్నధారు లగువారి కప
ర్ణారమణుఁడె యను నిగమస
మీరితములె మానముల సుమీ మతమునకున్ 205.

గీ. ఋతము సత్యమ్ము పరమ్మునై యొసగు బ్రహ్మ
మనఁగ నూర్ధ్వరేతుఁడు విరూపాక్షుఁ డైన
కృష్ణపింగళపురుషుఁగా నెంచి యట్టి
విశ్వరూపున కర్పించువినతి యిద్ది. 206.

సీ. ఏదేవునకు దివం జెసలారు శిరసుగా
నభ మొప్పు నెవనికి నాభి గాఁగ
భాస్కరుఁ డిందు డెవ్వాని కగుఁ గనులు గా

నెవని కౌ దిక్కతి శ్రవణములుగ
మఱివివృత్తంబు లామ్నాయంబు లెవనికి
వెలయు వాక్కుగ నంచు వేదకథితుఁ
డగునట్టి వానిమోహార్థినై శరణంబు
వేడెద ననువాక్యవిధముఁ బట్టి

గీ. శివుని యెడ భక్తి గల్గి తచ్చిహ్నచిహ్ని
తాత్ము లగుభక్తజనముల కనవరతము
నభవ లోక నివాస రూపామృతంబు
హస్తగత మౌఁ జుమీ యనాయాసముగను. 207.

వ. ఇంతియ కాదు! జగత్కారణం బెద్ది యని యొకప్పుడు దేవతలు ధ్యానించుచుండ నంబరంబున నంబరాంబరుండు దివ్యదర్శన మొసంగి నీవెవ్వఁడ"వని యడుగు నిర్జరుల కిట్లను. వేల్పులార! తొలుదొల్త నే నొక్కండ నుంటి నాకంటె నన్యుండు లేఁడ జగదీశ్వరుండ నగుట నద్వయుండనై నేన యుందు"ననియెఁ గావున నుపాదానకారణం బగుటం జేసి ప్రభు వగుశివుండ సద్బ్రహ్మాత్మాదికము లగుసామాన్యశబ్దములకు వాచ్యుం డయి జగత్కర్తయగు.

ఆ. లేఁడు తొల్లి బ్రహ్మ లేఁడు శంకరుఁ డొక్క
వాసుదేవుఁ డున్నవాఁ" డను నెడ
నగును వాసుదేవుఁ డన మహాదేవుండె
విను తదర్థ మింత విస్తరింతు. 209.

వ. తనయందు జగము లన్నియు వసించుటను వాసు వనంబడు నట్టిదేవుండ వాసుదేవుం, డతండ జగత్కర్త యగుమహేశ్వరుండు. శర్మ్మన సుఖంబు, దానిం గలిగించువాఁడగుటం జేసి శంకరుం డనం బరఁగు, నట్టిచో విష్ణుండు పాలకుం డనుట యెట్లు పొసంగును? ప్రాకృతప్రళయంబునందుఁ బాల్యం బగుజగం బెల్ల నభావంబుం

బొంది బాలకుం డగువిష్ణువును లేకుండుట ధ్రువంబు 'రుద్రులలో శంకరుఁ డను నేన' యనిన కృష్ణోక్తియే శంకరుండు పరమాత్మ యనుటకుఁ బ్రమాణము. మఱియు దుర్వాసునకు మహాదేవుండు సెప్పిన కొన్నివాక్యములు గలవు సావధానంబుగ వినఁదగినవి. 210.

సీ. అరయ నే నొకఁడ నక్షరుఁడఁ గర్తఁ బరాత్ప
రుఁడ శివుండను సదాత్ముఁడను జువ్వో
యజ విష్ణువులకు లోకావళి కాదికా
రణ మైనవాఁడఁ బురాణవస్తు
వను బూర్వగుఁడను బూర్వజ్యేష్ఠుఁడను శ్రేష్ఠుఁ
డను నద్వితీయుండ ననఁ దనర్తు
నస్మదిచ్ఛారూప యగుశక్తి లోకసం
హారమ్ము సేసి నాయం దణంగు

గీ. సృష్టిసేయుదు నేఁ బునస్సృష్టి దాని,
నది ప్రకృతియై గుణత్రితయాంకురప్ర
ధానకారణ మగు మహత్తత్వమును సృ
జించె మత్సాక్షికము స్వతంత్రించి యంత. 211.

మ కలిగించెఁద్రిగుణాత్మకం బగునహంకారమ్ము, దానఁ గుణా
త్మలు రుద్రుల్ పదునొక్కరుఁ బొడము, నందుఁ సృష్టికై రాజసా
త్మల, రక్షార్థము సాత్త్వికాత్మల, లయంబుఁ జేయఁగాఁ దామసా
త్మలఁ గావించె యథాప్రకారముగఁ బెంపుం గాంచు నట్లాదృతిన్.

క. ఆవిర్భవించిరి యవ
*ర్ణోవర్ణ మవర్ణములఁ బయోజాసన ల
క్ష్మీవర శివు లనఁ గ్రమముగ
మూవురు సకలమ్మునందు ముఖ్యులయి తొలిన్. 213.

---

క. 'అ'నుండి పొడమి ద్రుహిణుం,
*'ఉ'నుండి జనించి విష్ణుఁ; డుదితుఁడై 'మ'వ
ర్ణాన మహేశుఁడు, సకలము
లోన ప్రముఖభావమున వెలుంగుదు రెలమిన్. పాఠాంతరము.

ఆ. వారి ననుసరించి వర్తింతు రితరు లే
కాదశేషు లిట్టి క్రమమువారు
తద్విభూతు లీపృథక్పృథగాఖ్య మా
నమరతతి చరాచరము జగములు. 214.

క. నానాత్వము తత్తత్క-
ర్మానుస్మృతిని జెందినట్టి యఖిలమును లయం
బా నలబ్రహ్మజ్యోతి, న
నూన ప్రలయావసర మహోగ్రావస్థన్. 215.

సీ. అఖిలంబు లోఁగొని యరుణ మహారాజస
తేజంబు మలయ వర్తించు బ్రహ్మ
శ్యామలం బైన నారాయణ తేజంబు
నందు నస్తంగతుం డైనయంత
నంతర్భవించు నారాయణుండును శుక్ల
దీధితి యగురుద్రతేజమందు
నారుద్రుఁడు స్వకీయ మగుశుక్ల తేజంబు
తోఁ బ్రకృత్యంతర్గతుఁడుగ నౌను
గీ. బ్రకృతినామయు శుక్లవర్ణయు నగు మ
దిచ్ఛ నాయందె డిందుఁ జుమ్మీ య పాట
నను ననంతు సర్వజ్ఞ లౌజనులును గన
లేరు; నామాయఁ దెలియఁగా లేఁ డెవండు. 216.

సీ. కాన శ్రీరుద్రసూక్తజపాశ్రితులు రుద్ర
భవ్యపూజాదితాత్పర్యమతులు
పంచాక్షరీమనూపాసకుల్ భసితలి
ప్తాంగులు రుద్రాక్షహారధారు

లవిరతధ్యానపరాయణులును నాచు
నవ్యక్తు వ్యక్తాత్ము నభవు రుద్రుఁ
బూజింతు రేనరపుంగవుల్ వారికి
నిశ్శ్రేయసమ్ము ప్రాప్తిం చగుట

గీ. భూతిరుద్రాక్షధారణంబును బొనర్చు
మమల మగు భక్తిరీతిఁ జిత్తమును గూర్చు
శ్రీమహాదేవు నర్చ్యంశ్రీఁ దనర్చు
ద్వంద్వముక్తుండనై భవవ్యథ విదిర్చు. 217.

క. అని యభవుఁడు దుర్వాసో
మునికిఁ దెలిపి మాయమయ్యె మునియుఁ దదాచా
రనిరతుఁ డయ్యెను గావున
జనును ముముక్షులు పరాత్ము శంభు భజింపన్. 218.

గీ. ధృతిని నారాయణుం డద్వితీయుఁ డగుచుఁ
బ్రజల సృజియింపఁ దలఁచునప్పట జనించె
భూతములు, తద్విధాన విధాతయును బ్రి
జాపతియుఁ బుట్టి రని శ్రుతిసరణి లేదె? 219.

శా. ఆనారాయణశబ్దవాచ్యుఁడు శివుం డౌ నార మన్నన్ విధిం
ద్రాసఁ తాదినృకోటి, యద్ది యయనం బౌ వాఁడ నారాయణుం
డౌ నాదిత్యతతుల్ తదంశములె సుమ్మా భూమ్యరాదిస్థులౌ
నానారుద్రులకున్ నసమస్సనెడు నామ్నాయంబు మానం బిటన్.220

గీ. ఎవనివలనఁ ద్రిమూర్తు లుద్భవము గనిరొ
తత్పరేశుండె కారణత్వమున జ్యేష్ఠుఁ
డైనచందానఁ దాన కార్యత్వమునఁ గ
నిష్ఠుఁ డగు నని వాకొనె నిగమ మరయ. 221.

ఆ. జ్ఞానమయు ననంతు సత్యుని బ్రభు గుహా
నిహితు నెఱుఁగఁ దగు ననియెడు శ్రుతికిఁ
బరఁగ లక్ష్యమైనవాఁ డమ్మహేశ్వరుఁ
డతఁ డొకండు జగదుపాస్యుఁ డెన్న. 222.

క. నిర్గుణుఁడ వయ్యు నీశుఁ డ
నర్గళ చిరకాల చింతనాయత్తుండై
సర్గ మొనరింతు నని యం
తర్గతిఁ జింతించి పెక్కునాళులు కడకున్. 223.

సీ. ఆత్మతేజంబు సూర్యాకారముగ, మనం
బును జంద్రునిగ, సత్త్వమును గుజునిగ
సర్వవాఙ్మయమును సౌమ్యునిగా, సుఖ
జ్ఞానపుంజమ్ము వాచస్పతినిగ
వీర్యమ్ము దానవాచార్యునిగాఁ, గ్లేశ
మును శనైశ్చరునిగా, మును సృజించె
వెలుఁగు సూర్యాదిమండలములు తత్తేజ
మునఁ గాని వెలుఁగనేర్చునె తమంత?
గీ. నిందులఁ బ్రమాణముగ గ్రహియించి పలుకఁ
జను 'న తత్ర సూర్యో భాతి చంద్రతార
క'మ్మని యుఁ "యస్య భాసా జగంతి భాంతి"
యనియుఁ జాటెడు వేదమ్ము యతిలలామ! 224.

క. ఆనారాయణపదమున
కా నీశునివలన బ్రహ్మ మయ్యెఁ జుమి ప్రజే
శానుఁడుగ, విష్ణు వయ్యెఁ బ్ర
జానీకాజస్రపాలనాధారుఁడుగన్. 225.

ఉ. పాయక తోఁటినుండియును బ్రహ్మయు నీశుఁడు లేనియప్డు నా
రాయణుఁ డుండె నంచు శ్రుతియందు శ్రుతంబగుఁగా కభావమై
యీయఖిలంబు డిందినను నీశుఁడు విశ్వజగన్నిదానుఁ డే
చాయ నభావమొందఁ డని చాటవె వేదము లప్పరాత్పరుల్. 226

క. కర్మమునఁ బుట్టు లోకము
కర్మమున నశించు నను నిగమసూక్తిని ద
త్కర్మము కారణ మను టెటు?
కర్మము జడ మిడదు శివుఁడు గాని ఫలంబుల్. 227.

గీ. ఈశ్వరు నభావునిగ గ్రహియించువాని
నిందనొనరించి, యున్నవానిగ నెఱుఁగు
బ్రహ్మవేత్తను వేదమ్ము ప్రస్తుతించెఁ
గను "మసన్నేవ స భవతి" యనువచనము. 228.

ఆ. కాన లోకకర్త యగా నీశరూప ప
రాత్మ సంతత మ్ముపాసనమ్ము
సేయుచును దదీయచిహ్నమ్ము లొడల న
వశ్యముగ ధరింప వలయు నియతి. 229.

శంకరులు శైవమతమును ఖండించుట.

చ. అనవుడు శంకరుం డనె నహో సృజనస్థితినాశనముల్ పొన
ర్చును దుహిణాబ్జనాభ హరరూపము లొంది యొకండె దేవుఁ డం
చును శ్రుతి యుండె; మాకును దృఢంబుగ నిష్టము; లింగధారణం
బున కెచటన్ గనంబడదు మూలము కావున మానఁగాఁదగున్.

వ. మఱియు వేదవేదాంగవేత్త నాభి కూర్ధ్వమున సోమపులును, నధర
దేశంబున నసోమపులును వసియించుట శ్రూయమాణంబ కాదె!

